శ్రీరస్తు.

# పురుషార్థములు.



ఆంధ్రరత్న

## దుగ్గిరాల గోపాలకృష్ణయ్య

గారిచే రచింపబడెను.



శ్రీభావ సం॥ర యుగాది.

శ్రీమదాంధ్ర విద్యాపీఠగోష్ఠి, బెజవాడ.

 [వెల : ఎనిమిది అణాలు.

# విషయసూచిక.







ఈ పుస్తకమందు ఉపయోగింపబడిన కొన్ని పదముల

# అనుక్రమణిక.

క్రియ = Action
అర్థము = Aim
భాష = Expression
భావము = Impression
జ్ఞేయభావము = Objectification
ఆభాస = Sophism
హేత్వాభాస = Fallacy
అధికారము = Right
ధర్మము = Ethics
ఆత్మదర్శనము = Self-realisation
అభేదము = Identity
రసావేశావస్థ = State of mystic trance
సద్యస్కృతి = Maturity
విన్యాసము = Posture
వ్యక్తరూపము = Personal God
విధి = Destiny
మూలపదార్థము = Pure concept
వ్యక్తి లేక జీవాత్మ = Individual
జీవపదార్థము = Protoplasm
బుద్ధి = Reason
కర్మార్థకము = Objectification
బాల్యము = Universality
ప్రమాణము = Authority
గృహస్థుడు = Citizen
అపరోక్షానుభూతి = Intention
ఆచారము, సాంప్రదాయము = Tradition
భోక్త = Subjec
భోజ్యము = Object
స్వభావము = Nature
స్వధర్మ = Moral
ప్రజ్ఞ = Genius
లక్ష్యము = Aim or Ideal
పూర్వపక్షము = Prejudice
చిత్తవృత్తి నిరోధము = Self-discipline
ఉపాధి = Sheath

# ఉపోద్ఘాతము.



పురుషార్థములు ప్రతి మానవునకును జీవితాదర్శములు. కర్మభూమియగు భారతదేశమందు "చతుర్విధఫలపురుషార్థసిద్ధి" యనునది సర్వజన సంకల్పవిషయమైయున్నది. హిరణ్యకశిపాది రాక్షసుల కాలమందు వలె నిక్కాలమునను లోకమెల్లను ప్రజలు మోక్షాదర్శమును విడచి ధర్మార్థకామములనెడి "త్రైవర్గవిద్య" నుబడసి యైహికపరులై తుట్టతుదకు నరకకూపములఁ బడుచుండుట లోకవిదితమై యున్నది. అట్టిస్థితి నవీనప్రహ్లాదునివలె మనగోపాలకృష్ణుఁడు ప్రజలను మోక్షాయత్తులఁ జేసి లోకమున కంతకును నూతనబ్రాహ్మణధర్మమును జాటనుద్యమించి పురుషార్థములగూర్చి యిట ముచ్చటించుట యెంతయు సమంజసము.

ఈపొత్తములోని అయిదవ యధ్యాయము గాక దక్కిన యధ్యాయములన్నియు గోపాలకృష్ణుఁడు 1918వ సంవత్సరములో బందరు ఆంధ్రజాతీయ కళాశాలయం దుపాధ్యాయపదవియం దుండగా కళాశాలవారి యాధ్వర్యము క్రింద నొసంగబడిన యుపన్యాసపరంపరలోని యంతర్భాగములు. 1918 జూన్ నెలలో గోపాలకృష్ణుఁడు బందరు చేరిన వెంటనే కళాశాలాధికారులు "శాస్త్రశిక్ష" యను శీర్షిక క్రింద నీ దిగువ ప్రచురణ జేయించిరి.

"ఆంధ్రజాతీయ కళాశాలయందు నూతనముగా జూలై 15వ తేదీ మొదలు హిందూ సంప్రదాయానుసారముగా శాస్త్రశిక్ష (Collegiate Course) ఉపక్రమింప బడును. ఇందు చతుర్విధ పురుషార్థ సాధనమగు చతుర్విధశాస్త్రము లును, అనగా

౧. ధర్మపద్ధతి (Sociology and Ethics)
౨. అర్థపద్ధతి (Civics and Economics)
3. కామపద్ధతి (Aesthetics and Art)
౪. మోక్షపద్ధతి (Metaphysics and Biology)

ఈనాల్గింటియందును మూడుసంవత్సరములు విద్యార్థులు శిక్ష బొందుదురు ప్రథమభాగము (First Course) పై నాల్గింటియందును సామాన్య శిక్ష. ద్వితీయ భాగము (Second course) నాలుగు పద్ధతులలో నొకదానియందు విశేష శిక్ష.

స్కూలుఫైనలు చదివి కొంత సంస్కృత జ్ఞానము గల వారును సంస్కృత పాఠశాలలలో చదివి కొంత యాంగ్లభాషా పరిచయము గలవారును ప్రవేశమున కర్హులు.

విద్య యుచితము. ధరఖాస్తులు (జూలై) 15 - వ తేదీ లోగా పంపవలెను. ,, (కృష్ణాపత్రిక 29-6-1918).

ఈ "శాస్త్రశిక్ష" ది 3-8-18 తేదీన ప్రారంభింపబడి గోపాలకృష్ణుఁడు మఱి యారు మాసములలో కళాశాలపద విని విసర్జించుట తోడనే యంతటితో నంతమొందెను.

మొదటి యుపన్యాసానంతర మీ విధానము గూర్చి కృష్ణా పత్రికాధిపు లిట్లు వ్రాసిరి. "ప్రాచీన నవీనములకును, సకల పురుషార్థములకును సమన్వయ మొనర్చుటయే యీ విద్యా క్రమముయొక్క ప్రయోజనము" (10-8-18). గోపాల కృష్ణుఁడు తన యభిప్రాయముల ననేక గద్య, పద్య, హాస్య, వ్యాఖ్యలతో విశదీకరించుచు విద్యార్థు లెల్లరును మననము జేసుకొనుట కనువగునటుల నందలి ప్రధానాంశముల గంత స్థముగా జెప్పెనట. అట్టి యాతని యుపన్యాససారమే యీ పాత్రములోని ముఖ్యభాగములు.

ఈ యుపన్యాసములు గోపాలకృష్ణుని జీవితమందలి యాావనోద్దేశ్యములఁ దెల్పును. ఇందలి శైలి సామాన్యముగ గ్రాంధికము బోలినను అచ్చటచ్చట దేశీయములును, నుప న్యాసవేదిక కనువగు భాషాప్రయోగములును గూడ గాన నగు. భాషయు నంత పరిపక్వస్థితిని గాంచక పలుచోట్ల నాంగ్ల భాషాప్రయోగములు, పాశ్చాత్యగ్రంథకర్తల నుండి విపుల మగు నుదహరణలును కొన్ని యంశము లాంగ్లభాషలోనే చెప్పుటయు దటస్థించెను. ఇందులకు కారణము తన విద్యార్థు లాంగ్లభాషాపరిచితులగుటయే. ఇందలి యాంగ్లభాషా విషయ ములలో గొన్నిటి దెనుఁగుజేసి బ్రచురించితిమి. విషయము గూఢమగుటచే నర్థహాని కలుగునను భీతి కలిగినచోట్ల మా త్రము కొన్నిఁటి నటులనే యుంచినారము. చదువరులు సుల

భముగ గ్రహించునటులఁ గొన్ని యాంధ్రాంగ్ల పదముల పట్టిక చివరను బొందుపఱపఁబడమైనది.

ఇందలి "పురుషుడు : విద్యావిధాన" మను నయిదవ యధ్యాయము 1920 సం॥ రం లో శృంగపురి సామీప్యమున గోపాలకృష్ణు డుద్యమించిన శ్రీ మదాంధ్ర విద్యా పీఠ గోష్ఠి యను మహా ప్రతిష్ఠాపనమున కుపాంగముగ సంకల్పింపబడిన శిక్షాక్రమము. బాలుర బోధనాపద్ధతులందు "విద్యా" శబ్దముకంటె "శిక్షణ" మెక్కుడు సాంప్రదాయ సిద్ధమును శిష్యత్వాదర్శమున కెక్కు డనుగుణమును నని గోపాలకృష్ణుని యభిమతము. ("నశిష్యా న శిక్షా" - శంకరులు) ఈ "శిక్షణ" త్రిగుణోపేతమై యుంటచే మన బాలురవిద్యావిధానము పట్ల మిక్కిలి సహాయకారి యగుటయే గాక మన సంఘవిష యములందును శ్రీ గీతాచార్యుని "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః" యను సూత్రరాజమును సమ న్వయపరచుకొనుటకు బలమసాధకమై యున్నది. మన విద్యా విధానమందు మనబాలురకు గఱపు జ్ఞానవిషయములను సాంప్రదాయసిద్ధముగను సూత్రప్రాయముగను జెప్పవలయు ననుట యిందలి మఱొకవిశేషము. ఉదహారణ : భూగోళ శాస్త్రము పంచభూతముల ననుసరించి జెప్పవలయుననుట.

బందరు ఉపన్యాసములను శ్రద్ధతో దాచియుంచి యత్యంత దయతో మాకొసంగిన మా మిత్రులు శ్రీయు తులు తాడేపల్లి సత్యనారాయణ బి. యే. గారికిని, గబ్బిట

బాలసుందర శాస్త్రిగారికిని గోష్ఠివారే గాక ఆంధ్రలోక మెల్లరును కృతజ్ఞులై యుండెదరని నేను వేరే వ్రాయనక్కర లేదు. ఇందలి విషయములు చదువరులకు వీలగునట్లు సంస్కరించుటలో విశేషముగ తోడ్పడిన శ్రీయుత గొల్లపూడి వెంకటేశ్వర్లుగారికిని, వ్రాతప్రతి తయారు చేయుటలో కొంత వరకు సహాయపడిన మా మిత్రులు సరిపెల్ల విశ్వేశ్వరప్రసాదరావుగారికిని మేము కృతజ్ఞులము.

శ్రీమదాంధ్రవిద్యాపీఠగోష్ఠి,
సత్యనారాయణపురము, విజయవాడ,
శ్రీభావ సం॥ర యుగాది ౫౦౩౫.

గుమ్మడిదల సుబ్బారావు,
విచారణకర్త.



శ్రీరస్తు.

# పురుషార్థములు.

## మొదటి అధ్యాయము.

### ప్రస్తావన

### విజ్ఞానము సూత్రప్రాయముగ నుండవలెను.

సూత్రమన నేమి? మాలయందనేకమణులకు దార మేరీతిగా నాధారమగుచున్నదో, అట్లే శాస్త్రమునందును సూత్రము ముఖ్యాంశగర్భితమై యనేకజ్ఞానమణుల కాధారమై విజ్ఞాననిర్మాణమున కుపకరించుచున్నది. మాలాలక్షణ మేమన నది ఆద్యంతములు లేకయుండును. విజ్ఞానమాలయు నట్టిదే. అట్టి ఆద్యంతరహితమైన మాల కాధారము సూత్రమే. కాన శాస్త్రబోధ, శాస్త్రపరిశీలన, శాస్త్రపఠన, సూత్రానుసరణముగనే యుండవలయును. సూత్రరహితముగ బ్రస్తుతకాలమున సర్వశాస్త్రములును వ్యవహరింపఁబడు చున్నవి. కేవల వ్యాఖ్యాన రూపములైన శాస్త్రములు భిన్నరూపములఁ దాల్చును. ఇది లక్షణవిరుద్ధము. జ్ఞానార్ణవమునందు కల్లోలము పర్యవసానము. ఇప్పటి విద్యాపద్ధతి సూత్రరహితము.

సూత్రమింకను జ్ఞానబీజాత్మకము. ఆ బీజము సర్వ ప్రపంచాంతర్గత మగు ద్రవ్యసంతతిని సంగ్రహించి, యా ద్రవ్యమును భుజించి, శాఖోపశాఖాన్వితమై, సంసారార్తిచే బరితపించుచున్న జీవరాసులకు ఫలదాతయై రససిద్ధికి స్థావరమొసంగి కృపాదాతయై కాపాడునట్టి ప్రధాన దేవతగఁ బరిణమించును.

కనుక దేశకాలపాత్రముల ననుసరించి వ్యాఖ్యాన మొనర్చి జ్ఞానబోధఁ జేయుటకు ముఖ్యాధారముగ నుండునది సూత్రము. ఇది సంక్షిప్తరూపమున నుండుటవలన సర్వజన సామాన్యమునకు దృష్టిపథమునం దుంచుకొనుటకు వీలగును. అట్లుంచుకొని జపము సల్పుచో (జప మనగా శ్రద్ధ గలిగి విశ్వాసముతో గ్రహించుట) సూత్రగర్భితమగు జ్ఞానజ్యోతి విజృంభించి అంధకారమయములైన మన మనోగోళములను దీపింపఁజేయును. ముఖస్థముగ నెఱుంగుటకు వీలు కలుగ జేయును. (The Sutra represents the mere profile of all knowledge.)

మనమీ సూత్రసృష్టిని ఆంధ్రముననే చేయవలెను.

ఎందుచేత? జ్ఞానాన్వేషణమునకు ఆత్మానుభవమే ప్రథమసోపానము. ఆత్మానుభవము స్వ“భావము”గాఁ బరిణమించును. స్వ“భావ” వ్యక్తీకరణమే స్వ“భాష.” (The expression of one's own ideas assumes the form of one's own language.) మన భాష • ఆంధ్రభాష. అందువలనను

మన స్వాత్మానుభవము ప్రథమసోపాన మగుటను ఆంధ్ర భాషయందే సూత్రనిర్మాణము గావింపవలయును. అదియుఁ గాక గీర్వాణభాష ప్రస్తుతమందు వాడుకలో లేదు.

---

## రెండవ అధ్యాయము.

# ప్రథమసూత్రము : పురుషార్థములు.

ధర్మార్థకామమోక్షములు పురుషార్థములు. (These constitute the fundamental: motif of Hindu Ethics and Sociology. Yoga represents the subjective interpretation of our Idealism; Purushardhas, the objective.)

పురుషార్థచర్చ ప్రథమసూత్రమునందే యేల చేయవలయు? పురుషార్థము లన నేమి?

స్వాత్మానుభవమన జీవత్వము తటస్థించిన తోడనే (భూతజన్మ లభింపగనే) జననాది మరణాంతమువరకు సర్వభూతములతోను జీవునికి గలుగు సంబంధ బాంధవ్యమువలనఁ గ్రహింపనగు విషయజ్ఞానమే యనుభవము. అనగా క్రియచే (action) అనుభవము గల్గును. అర్థము (aim) సంబంధమును సూచించును. అర్థము ననుసరించియే జ్ఞానాన్వేషణ మొనర్పవలెను.

పురుషార్థములు జీవునియొక్క ముఖ్యసంబంధమును దెల్పును. ఆసంబంధమే నిత్యపదార్థమునందు కలిగియుండవలయునో దానిలక్షణమును గ్రహించుటయే జ్ఞానము. జ్ఞాతయయిన జీవుడు జ్ఞేయపదార్థమును దెలిసికొనును. కర్త, కర్మ, క్రియ. జ్ఞాత (కర్త), జ్ఞానము (క్రియ), జ్ఞేయము (కర్మ), ఈ మూడింటికిని అవినాభావసంబంధము.

సంస్కృతభాష ధాతురూపముగ నుండును. ఇందుకు కారణ మేమి? ధాతువు సంబంధమును తెలియబరచునది (Verb is the embodiment of this relation). ఈనామరూపాత్మకమైన ప్రపంచముయొక్క నిజస్వరూపము సంబంధమే కనుకను, సంబంధము క్రియారూపము కనుకను, నామములు క్రియాజన్యములై యుండవలయును. అందువలననే దేవభాషయైన గీర్వాణభాష ధాతుమయము.

అర్థమున సంబంధము. అర్థము - క్రియ. భావవ్యక్తీకరణము కేవలము మాటలమూలముననే చేయవలయునని సిద్ధాంతము లేదు. భావము లేనిది భాష యుండనేరదు. 'భాషాసేవ'యనుమాట అర్థరహితము. భాషయే మనకు సేవజేయును.

మన సంప్రదాయము ప్రకారము ఉత్పత్తి నాలుగు విధములు. అండజ, పిండజ, ఉద్భిజ్జ, స్వేదజ, అనగా చెమటవలన బుట్టినది - పాశ్చాత్యుల విభజనము వృక్ష, పాషాణ, పశ్వాదులు.

## పురుషశబ్దలక్షణము : తత్ప్రయోగసారస్యము.

ప్రకృతియందున్న జీవస్వరూపమును బరీక్షించినచో మానవస్థితిని పొందినపుడే సరియగు సృష్టి బయలుదేరుచున్నదని మనము గ్రహింపఁ గలుగుచున్నాము. ఈస్థితియందే స్త్రీ పురుషస్వరూపములు స్పష్టముగ నేర్పడి, పరిణామమునకు ఆధారభూతము లగుచున్నవి. కాని యీ స్త్రీపురుషభేద వ్యక్తిత్వము అనుభవమున కేవలవిరుద్ధభావమును దాల్చుట లేదు. పురుషునికి స్త్రీకి నిందే అభేదము కలదు. మనుస్మృతి ననుసరించి, నిజముగా విచారించిచూడ పురుషుడు కల్ల. స్త్రీయు నట్టిదే; కాని యీ రెంటియొక్క ఐక్యమే పుత్రాదిపరిణామమును బొంది సంపూర్ణత్వము అనగా శాశ్వతత్వమును గలుగజేయుచున్నది. పురుషుడు స్త్రీయందు తాను తిరిగి జన్మించినగాని, తన సంపూర్ణత్వమును (శాశ్వతత్వమును) పొందనేరడు. కావున పురుషశబ్దప్రయోగము మిక్కిలి సమంజసముగా నున్నది. ఇచ్చట పురుషుడన కేవలపుంసాత్మకమైన వ్యక్తిత్వమునే సూచింపక, స్త్రీపురుషసమ్మేళనమువలన గలిగిన స్వకీయ శాశ్వత సంపూర్ణస్వరూపమే యని స్ఫురించుచున్నది. కాన పురుషపద ప్రయోగము మిక్కిలి సమంజసము. ఉదాహరణము:— సంపూర్ణ పురుషత్వము శివపార్వతుల యర్ధాంగీకృత దాంపత్యమువలననే సూచింపబడియున్నది. కనుక పురుషునికి ప్రకృతియందు జ్ఞేయభావము [Males alone are capable of the absolute objectivity of mind.]

ప్రవృత్తి = బహుత్వము = స్త్రీత్వము; నివృత్తి = ఏకత్వము = పుంసత్వము.

పురుషుడు = గాయకుడు } గానము పుత్రాదిపరిణామము.
స్త్రీ = స్వరము }

గాయకుడు, స్వరము, గానము - ఈమూడును కలిసియే సంపూర్ణత్వము నొందుచున్నవి.

## ౨ వ సూత్రము: ధర్మనిర్వచనము.

సర్వభూతహితమై మూలపదార్థ ప్రతిబింబితమై ప్రతి జీవునిచే నారాధింపబడుకర్మ ధర్మము. ఆత్మజ్ఞాన చోదిత కర్మ ధర్మము.

ధర్మము కర్మాత్మకము. కర్మము సంకల్పజన్యము. సర్వ సంకల్పములకు ఆదర్శము ఆత్మదర్శనము. ఆత్మదర్శన మను లక్ష్యము ప్రతిజీవిమనోగోళమునందు వ్యక్తముగా నుండదు. అది వ్యక్తముగ నున్నపుడే, కర్మాచరణము లక్ష్యచోదిత మగుటచేత, ధర్మత్వసిద్ధి గాంచును. సర్వసంకల్పములకు ఆత్మ దర్శనమే లక్ష్యమని చెప్పినపుడు, దుష్టకర్మలకుగూడ ఆత్మదర్శ నమేనా ఆదర్శమని ప్రశ్న గలుగవచ్చును. ఆత్మోపలబ్ధి ఆచ రించు కర్మనుబట్టి, తత్క్షణమేగాని, లేక కాలాతిక్రమణమైన పిమ్మటగాని, లభించును. దుష్టకర్మాచరణమునందు కర్మ

పరిపాకానంతరమే ఆత్మదర్శనము లభింపనగు. ఏలాగున దురా చరణమున ఆత్మదర్శనము లభించును? ఆ ఆత్మదర్శనము దుఃఖ రూపమును, హేయకారణమును. ఆహేయకారణము బుద్ధిని, సద్గురుసేవను, సదాచరణమును వాంఛింపజేయును. తద్వారా సత్సంకల్ప మేర్పడును. సత్సంకల్ప మన నాత్మదర్శనము. కాని కాలాతిక్రమణము తప్పదు. ఇది జన్మాంతరమున సిద్ధింప వచ్చును. ఇందుల కుదాహరణము రావణకుంభకర్ణాదులు. కావున సర్వసంకల్పములకు ఆత్మదర్శనమే లక్ష్యమైనను,సద్గురు సేవవలనను, సద్విద్యాసంగమువలనను సంకల్పభావమందు ఆత్మదర్శన వ్యక్తీకరణమైనచో, అనగా సర్వకర్మలకు సర్వ భూతహితమును మూలపదార్థ ప్రతిబింబితలక్ష్యమును నేర్పర చుకొనినచో, సత్కార్మానుష్ఠానము లభించును. అదియే ధర్మము.

సర్వభూతహిత మననేమి ? ప్రతికర్మ, భూతములయొక్క పరస్పర సంయోగ వియోగరూపముగ నుండును. దాని ఫలి తములు సుఖదుఃఖములు. కర్మయొక్క ప్రధానలక్ష్య మగు ఆత్మదర్శనము సుఖావహము గనుకను, అట్టి సుఖము సంయో గమువలన సిద్ధించునుగనుకను, సర్వభూతములతో సంయో గము నెరవేర్పనగుకర్త హితకర్మ గనుక సర్వభూతహితము.

సర్వభూతహితముగఁ బ్రవర్తించుటవలన, దుఃఖము కనఁబడుటలేదా ? ఇచ్చట హేత్వాభాస కలదు. "కర్మాచర ణమునందే సుఖదుఃఖము లున్నవి" (గీత). సుఖదుఃఖములు

స్వీయాచరణమునందే అనుభవనీయములు. సుఖదుఃఖములు అవస్థలు. అవస్థ స్వీయము; అనగా స్వాత్మానుభవపరిణామములే. అందుచే స్వాత్మేతరమైన పదార్థములు తమంతట దామే సుఖదుఃఖముల గల్గింపనేరవు. ఉదాహరణము:— ఏసుక్రీస్తు - శిలాహింస, ప్రహ్లాదుడు.

సర్వభూతములకు హిత మొనర్చుటకు సమర్థత ప్రతివ్యక్తికిఁ గలదా? దీనికి "తత్త్వమసి" యనుశ్రుతి ప్రమాణమును మనము విచారింపవలయును. "వ్యక్తి" యన సదసద్వివేకము, నిత్యానిత్యవస్తువివేకముఁ గలిగియుండుట. ఈశ్రుతిప్రమాణముచే, సర్వభూతములకు జీవునికి అభేదము నిరూపింపబడినది గాన సర్వకర్మాచరణ స్వాత్మపర మగును. వ్యక్తి లేని భూతములకు గూడ సహజముగ ధర్మార్థముగ నాచరణ పరిణమించును. ఈ ధర్మాధర్మవిచారణ వ్యక్తిత్వము లేని జీవులకు అవసరములేదు. అవి సహజముగనే ధర్మయుక్తముగఁ బ్రవర్తించును. ఉదాహరణము:— గజేంద్రుడు.

ఎందువలన మనము సర్వభూతహితముగఁ బ్రవర్తింపవలెను. "తత్త్వమసి" యను శ్రుతిప్రమాణమునుబట్టి, మనకును సర్వభూతములకును ఆధ్యాత్మికమం దభేద ముండుటచేతను, వ్యావహారికమందు వ్యక్తిత్వభేద ముండుటచేతను, హితభావము ప్రతివ్యక్తియందును భేదమైయుండుటచే, ఈ భేదములగు హితభావములను సమన్వయముచేసి వర్తించుటయే సర్వభూతహిత మనుటకు భావము. ఈ సర్వభూతహితము చేయుటకు కారణము ఆధ్యాత్మికాఽభేద

త్వము. (We derive sanction for morality from this fundamental metaphysical identity of all existence.) వ్యావహారికమందు, ఆధ్యాత్మికమందువలె వ్యక్తిభేదము లేకున్న, సర్వభూతహిత మను పదమే మన కనవసరము. అట్టి స్థితియందు ధర్మ మనునొకపురుషార్థమే అనవసరము. అనగా సహజముగనే ప్రతివ్యక్తియు ధర్మము నాచరించును. ఇట్టి స్థితి యెందైన గలదా యని మనము విచారించిన దేవతలు అనగా మహాపురుషులయందు వ్యక్తమగును. వ్యవహారము నందు ఆధ్యాత్మికసిద్ధియే ధర్మావధి. (Cf. The categorical imperatives of Kant) సర్వభూతహితము వ్యావహారిక విశేషణము. మూలపదార్థప్రతిబింబము ఆధ్యాత్మికవిశేషణము- అనగా ప్రతికర్మయు మూలపదార్థ ప్రతిబింబమై యుండవలయును. మూలపదార్థము ఆత్మ. ప్రతికర్మయు ఆత్మోపలబ్ధిస్వరూపమే అయి యుండవలయును. ఇచ్చట మూలపదార్థమునకు కర్మకు అవినాభావసంబంధము నిరూపింపబడినది. మూలపదార్థము కర్తృ కర్మ క్రియలయొక్క సమన్వయమై వీని యన్నిటియందు వేరువేరుగా సంపూర్ణత్వముతోఁ గూడ వసించియున్నది. కావున కర్మకు మూలపదార్థమునకు నేమియు భేదము లేదు. దీనికి ప్రమాణము "తత్త్వమసి". వ్యావహారికమున భేదమును, ఆధ్యాత్మికమున నభేదమును సూచింపవలసిన యావశ్యకము కలదు గాన "ప్రతిబింబ" శబ్దము సమంజసముగ నుండును. మూలపదార్థమునకును, కర్మకును భేదాఽభేదత్వమును సూచించుచున్నది.

# మూడవ సూత్రము : కామనిర్వచనము.

రసానుభవము కామము.

ధర్మగర్భితమై, నామరూపసృష్ట్యాత్మకమైన రసావేశావస్థయే (State of mystic trance or aesthetic intuition) కామపురుషార్థసిద్ధి. రసావేశావస్థ యన నేమి? రసము, ఆనందము, రసావేశావస్థ - అన్నియు నొక్కటియే. రసావేశావస్థయే పురుషార్థసిద్ధి యని చెప్పుటవలన బ్రథమముననే రసావేశావస్థయొక్క ప్రధానలక్షణము ద్యోతక మగుచున్నది. అది యేదనగా, పురుషార్థసిద్ధికిని, ఆత్మదర్శనమునకును, అనన్యత్వము నిరూపింపబడినది.

అందుచే రసావేశావస్థగూడ ఆత్మదర్శన మనియే సమన్వయము చేయవలసిన అవశ్యకత యేర్పడుచున్నది. రసావేశావస్థ యను పదమున నంతర్భాగములు రసము, ఆవేశము అవస్థ రస మననేమో, ఆవేశ మననేమో, అవస్థ యననేమో గుర్తెరిగినపిమ్మట, ఈసమాసముయొక్క విగ్రహము అనగా నీపదభావములయొక్క సంబంధసమన్వయములు తెలిసిననే కాని రసావేశావస్థ యను పదముయొక్కలక్షణము తేలదు.

1. రసము - వ్యక్తిత్వసిద్ధి కనంతరము, జీవుడు తద్వ్యక్తిత్వలయమువరకు పొందు అనవ్యక్తానుభూతియే రససిద్ధియొక్కలక్షణము. బుద్ధి లేనిది అనుభవ ముండనేరదు. స్వభావపరిణామమే యనుభవము. బాల్యమునం దనుభవము లేదు.

ఈ పరిణామముయొక్క సంపూర్ణస్థితి 'లయము.' లయ మన నవ్యక్తము.

రససిద్ధియు, రసము నొక్కటియే. ఏలనన, అనవ్యక్త్యనుభూతి, అపరోక్షానుభూతి, ఒకటియే. ప్రత్యక్షము రెండు విధములు. ఇంద్రియదర్శన ప్రత్యక్షము, సాక్షాత్కారము (తన్మయత్వము) అనవ్యక్త్యానుభూతియందు, ఆత్మసాక్షాత్కారము తటస్థించును. ఆత్మదర్శనమైనపుడు కార్యకారణ భేదము నశించును. ఇవి కేవలము నామమాత్రములే గనుక అనవ్యక్త్యనుభూతిలో ద్వంద్వము లేదు. కనుకరస రససిద్ధులకు అనన్యత్వము సిద్ధాంతము చేయబడినది.

రససాధకునియొక్క రసావేశావస్థయే, రససిద్ధిగావలయు. రసాస్వాదనమును నిట్టిదే. రసమున, రససిద్ధికి రససాధకునికిని అనన్యత్వము సిద్ధించును. అట్లనన్యత్వము పొందినపుడు కర్తజీవనము అవస్థాపరంపరాత్మకమైనదిగనుకను, రసావేశావస్థయు, రస రససిద్ధి రససాధకులతో అనన్యత్వమొందును.

**2.** ఆవేశమునందు రెండుభావములు గలవు. (**1**) సద్యస్కత (**2**) సంపూర్ణత. ఈ రెండు భావములు గలిగిన యీ పదము రససిద్ధియొక్క స్వభావమును దెలుపును. ఆ రససిద్ధి ప్రభోధసమయ మేతీరుగ సువ్యక్తము కాదో, అటులనే యదియు సువ్యక్తము కాదు. దాని సమయమునందు, అధికారము దానికే కలదు. అందువలన సద్యస్కత దానియందే గలదు. సంపూర్ణతకూడగలదు. కావున, సద్యస్కత్వసంపూర్ణ

త్వసమ్మేళనమైన యావేశపడ మిచ్చుట రససిద్ధియొక్క స్వభావము దెలుపుట యందు యోగ్యము.

3. అవస్థ యనగా చిత్తవృత్తి ప్రచోదితమైన జీవిత విశేషము. మన వ్యక్తిత్వదశలో ప్రతిజీవుని ప్రతిక్షణానుభవము అవస్థారూపము. అనగా సర్వజ్ఞానేంద్రియ కర్మేంద్రియముల వర్తనముతోఁ గూడుకొన్న జీవితవిశేషము - దీని యందు సంపూర్ణత గలదు. ఈ క్రిందిలక్షణములు సిద్ధించును. (1-2) సర్వజ్ఞానేంద్రియ కర్మేంద్రియ వ్యాపారము (3) ఒక విధమగు సర్వాంగవిన్యాసము (4) సర్వచేష్టాను గుణ్య ప్రదర్శనము (5) తన్మయత్వము.

ఈ యవస్థ స్వల్పకాల ముండినను, దీర్ఘకాల ముండినను, దానికి సంపూర్ణత సిద్ధించును. కనుకనే దీనికి జీవితవిశేషమనవచ్చును. జీవితమున కనేక అవస్థలు - (1) బాల్య యౌవన, కౌమార, వార్ధక్యములు, (2) జాగ్రత్స్వప్న సుషుప్తులు, (3) వ్యావహారిక, పారమార్థికములు, సుఖదుఃఖములు, కలిమిలేములు. ఆశ్రమావస్థలు - బ్రహ్మచర్యము ఇత్యాది; బ్రహ్మ, క్షత్రియ వైశ్యశూద్రత్వములు, స్థావర జంగమములు; దేవతిర్యఙ్మనుష్య క్రిమికీటకాదులు; జీవాత్మ ప్రత్యగాత్మలు; పరమాత్మ; పురుష ప్రకృతులు; స్త్రీ పురుష నపుంసకములు; సృష్టిస్థితిలయములు; ఏకత్వ బహుత్వములు; జ్ఞాతృజ్ఞానజ్ఞేయములు; సత్వరజస్తమోగుణములు. ఇందును బట్టి సర్వము అవస్థారూపమే.

అందువలన రససిద్ధియు నవస్థాభేదమే. "మన కేమ యిన తెలిసినది" అనగా మన స్వభావము తత్పదార్థ స్వరూపమును ధరించిన దన్నమాట. ("We know anything" means that we actually became it - the thing known; our consciousness assumes that form. Therefore in our own individuality, the full content is our *Chit* which is made up of (1) the race ideal సంప్రదాయము (2) the individual self స్వస్వరూపము.) కాన అవస్థ అను పదము రససిద్ధిస్థితిని చక్కగా దెలుపును. ద్వంద్వాతీతమునందు రసావేశావస్థ శాశ్వతముగాని అశాశ్వతము కాదు. ద్వంద్వస్థితి యనగా ప్రకృతిసిద్ధమును విచక్షణానురూపమును నగు అవస్థ. ఇట్టి స్థితియందు, అనగా వివిధకళాప్రదర్శన ప్రేక్షణమున గూడ రసావేశము కలుగును. కాని ఆ స్వరూప పరిణామము పూర్ణముగ నంగీకరింపబడనప్పుడు, తన్మయత్వమునకు నిరర్థకము వాటిల్లును. కనుక నది యశాశ్వతము.

"ధర్మగర్భితమైన" అను వాక్యము; రసాస్వాదనాన్వేషణము ప్రాకృతమందు దుర్వ్యాప్త్యాస్పద కారణమును గావున రససిద్ధులు ధర్మేతరు లగుటకు వీలులేదనుట కుపయోగింపబడినది. రససిద్ధులు ధర్మేతరు లయినప్పుడు వారు అసార్థకనాములు; ఏలయన ధర్మము సర్వభూతహితకర్మ. మానప్రాణధనాదులకు భంగపాటొదవించుకర్మ ధర్మేతరము. రససిద్ధి ఆత్మదర్శనరూపకకర్మ. తత్కర్మ సర్వభూతహితాత్మకము. అట్లు గాకుండుట యసమంజసము. ధర్మేతరు

లగు రససిద్ధులు ఆభాసకులు. సంసారమందు (ద్వంద్వమందు ధర్మనిబద్ధవర్తనలు గానిచో తదాభాసమున జండాలత్వమును నరకమును ప్రాప్తించును.

రససిద్ధికి కల్పితరూప మవసరము. ప్రకృతిరూపములు ఆభాసకములు. ఉదాహరణ:—

స్త్రీ—ప్రకృతి, ఆభాసకము.
భార్య—స్త్రీకి కల్పితరూపము. పుత్త్రినిద్వారాసిద్ధి.
రాయి—ప్రకృతి.
శిలావిగ్రహము—కల్పితరూపము.

| | | |
|---|---|---|
| గింజ | ప్రకృతి | వర్షము |
| విత్తనము | కల్పితము | కాలువలు |

ప్రకృతి రూపము (1) అసంపూర్ణత, (2) వ్యక్తత, (3) ఆభాస (4) అనిత్యత, (5) అవిద్య, మొదలగు వానిచే దిజ్మాత్రిలక్షితము గావున సంస్కరింపబడక (కల్పితముగాక) రససిద్ధి గల్గింపదు.

ప్రకృతియందు మూలపదార్థము ప్రతిబింబితమాత్రము. అందువలన రససిద్ధ్యన్వేషకుడు ప్రకృతియందు స్వేచ్ఛాపర్హుడు. రసావేశావస్థ ధర్మబద్ధమనుటలో, ప్రకృతియందు తద్వర్తనస్వభావము నిరూపితము. ధర్మగర్భిత పదసామరస్యము. అందువలన ధర్మానుకూలముగనే రసాన్వేషణము వ్యావహారికమున ననువర్తనీయము. ఈ యవస్థ ద్వంద్వరూపమున నామ రూప సృష్టి(కల్పిత మను నర్థ మిక్కడ ననువర్తనీయము)

ప్రాణప్రతిష్ఠ: "నామరూపసృష్ట్యాత్మకమైన" అనుపదము నందు అంతర్భాగమగు సృష్టి యనుపదోపయోగమున, తదంత రావస్థలగు స్థితిలయాదులను గూడ సూచించుట యెక్కువ సమంజసమను ఆక్షేపణకు సమాధానము. సృష్టి అనుపదముననే సృజింపబడినదని నిరూపితము. ఆపదార్థము, తదాశ్రయము లగు అవినాభావసంబంధము గలిగిన స్వభావస్వధర్మాదు లును నం దిమిడియుండును. స్థితిలయములు ప్రాకృతికములు గావున 'సృష్టి' సమంజసము. (Death also is created with creation)

## నాల్గవ సూత్రము : అర్థము.

### జీవయాత్రోపకరణ సాధకము అర్థము.

ఈ పురుషార్థము కేవలవ్యావహారికము. ఇట్లనుటచే నది ఆధ్యాత్మిక నిష్ప్రయోజన మని సూచ్యము. మున్న ఆత్మదర్శనమే ప్రధానలక్ష్య మంటిమి. కావున నిదియు నట్టి దిగ్నై యుండవలయును. "అన్నం బ్రహ్మేతి వ్యజానాత్" (తైత్తిరీయోపనిషత్తు.)

దీనియందన్నమునకు బ్రహ్మపదార్థముతో అనన్యత్వము సూచింపబడెను. జీవయాత్రకు సర్వముఖ్యోపకరణములు అన్న రూపములు గాన, నివి ప్రకృతి (భూత) సముదాయమందు సమకూర్చబడును. కావున ప్రకృతి యెల్ల లయావస్థయై

పురుషుని (ఈశ్వరుని) చే భుజింపబడును. అందువలన సర్వ ప్రాణులకు (సర్వతత్త్వములకు) వైరుద్ధ్యావస్థ (వియోగము) సంభవించును. అప్పుడు వ్యక్తులకు లయము విధికము. అట్టిచో వ్యక్తులలో బలవద్బలహీనదశ లేర్పడును. బల మీశ్వర రూపము; తదార్తిహీనత్వము వ్యక్తులను శరణాగతులనుగా జేయును. ఈశ్వరుడు శరణ్యుడు. కావుననే యీ పురుషార్థమందు పరిపాలకుడు పరిపాలితులు, బలిష్ఠులు దుర్బలులు అను విభజన కానసగును. ఇవి మతెంతును కానరావు.

సృష్టి - కామపురుషార్థమునకు అధిష్ఠానదైవము బ్రహ్మ
స్థితి - ధర్మపురుషార్థమునకు విష్ణువు
లయము-అర్థపురుషార్థమునకు ,, శివుడు
} మోక్షము.

ఈ మూడింటిని సమన్వయము చేయునది మోక్షము. ఈశ్వరుడు వ్యక్తరూపము. వ్యక్తత్వముననే ఈశ్వరత్వముగలదు. దీనికి పాశ్చాత్యులు "Personal God" అని యందురు. కర్మప్రేరణచే నీశ్వరుడుతన విధికృత్యములను నిర్వర్తించు చుండును. మన త్రిమూర్తులును అటులనే వ్యక్తరూపులు. కర్మప్రేరణచేత విధికృత్యములను నెరవేర్చుచుందురు. (భర్తృహరి - కర్మపద్ధతి 93; భగవద్గీత 3 వ అధ్యాయము 19, 22, 23, 24; ఐతరేయోపనిషత్తు 3వ అధ్యాయము 5వ భాగము, 2వ వాక్యము.)

కావుననే యీత్రిమూర్తులును దుష్టశిక్షణము, శిష్టరక్షణము, ధర్మస్థాపన ముఖ్యధర్మముగ పరిగణించుచున్నారు.

(గీత 4 అ. 7, 8). వ్యావహారికదశయందు అనగా వ్యక్తిత్వ దశయందు కర్మయే విధి. కర్మకును కర్మమునకును కార్యకారణ సంబంధము, అవినాభావసంబంధము. వ్యతిరేకము కలదు, కాని భేదములేదు. కృత్యము = చేయదగినది; కర్మము = పని; కర్త = విధి; కృత్యము = కారణము; కర్త = కార్యము. జన్మాంతరమందు కర్మ తిరిగి కారణమగుచు ప్రభుత్వము చేయుచుండును. (Action carries with it the seed of its own fruit.... Both are identical.... కర్మ is used for both in our language.) కర్మప్రేరణచే సర్వప్రాణులును కర్మనాచరించుచుందురు. వ్యావహారికమం దాచరింపబడు కర్మము అర్థసంగ్రహమందు వర్తించును. అర్థసంగ్రహము ప్రాణులకు వైరుధ్యభావమును గల్పించును. కనుక, సుఖదుఃఖములును శత్రుత్వమిత్రత్వములును, న్యాయాన్యాయములును, లాభనష్టములును - ఇత్యాది ద్వంద్వసంకులమగు అవస్థాసంబంధములతో **నిండియుండును. ఇందువలననే రాజ్యములు, సామ్రాజ్యములు, ఇత్యాదిప్రజాజీవనపద్ధతు లేర్పడినవి. ఇందువలననే ఈశ్వరులు (ప్రభువులు)** సద్వ్యక్తుల బోషించుటయు, దుర్వ్యక్తులను శిక్షించుటయు, న్యాయము దీర్పుజెప్పుటయు, అన్యాయమును ఖండించుటయు, మొదలగు వ్యావహారిక వ్యాపారములను వర్తింపజేయుచుందురు. (Politics and Economics have the same source వైరుధ్యభావము which is due to the ఆరోపణ of అన్యస్వరూపం to Everything.) సర్వభూతములకు వ్యక్తిత్వదశయందు అహంకారమే చిద్వ్యాపా

రముగ నుండును. అందువలననే అర్థసంగ్రహమందు విధింపబడిన లయావస్థను గమనించి, వేదనజెంది యా యవస్థ నొలగించుకొనుటకు పురుషుడు ప్రయత్నించుచుండును. (అర్థసంగ్రహణ మనగా లయశక్తియే.) ఈ ప్రయత్న మాత్మదర్శనము. అధ్యాత్మమందభేదముచేత గల్గెడి స్నేహభావము వ్యావహారికమందు వైరుధ్యభావము వహించును. వైరుధ్యసంబంధమందు కూడ, ఆత్మోపలబ్ధి ఘటించుననుట కిది తార్కాణము. ఉదాహరణము- యజ్ఞపశువు, ఇందుకు నిదర్శనము రావణుడు. ఈతడు అర్థసంగ్రహమునందే వైరుధ్యమును బొంది లయమున నాత్మోపలబ్ధి నొందెను. అది వేదన సీతాపహరణము.

అర్థసంగ్రహము (గీత అ 9.22, అ 10.9) ఆత్మోపలబ్ధియే లక్ష్యస్థానముగానున్న సాధకునికి, అర్థము హస్తగతమై యుండును. వ్యక్తిత్వదశయందుండి కర్మము సదా ఆచరించుచు ఆత్మోపలబ్ధి నాశించు జీవి సాధకుడు.

కర్మ రెండువిధములు. 1 అర్థసంగ్రహము. 2 లోకసంగ్రహము.

సన్యాసికి అర్థసంగ్రహ మావశ్యకమా కాదా? ఈ ప్రశ్న సన్యాసి ధర్మబద్ధుడు కాడను లోకప్రతీతి ననుసరించి కలిగినది. కాని సన్యాసియును ధర్మబద్ధుడే. ఏలనన సన్యాసాశ్రమము వ్యక్తిత్వదశయందే యేర్పడినది. వ్యక్తిత్వదశయందు కర్మాచరణము చేయకుండుటలేదు. కర్మము సంయోగ

వియోగరూపము. అనగా అర్థపరమందు అనుభోగవిసర్జనములు రెండును సన్యాసి యాచరించుచునే యుండవలయును. అర్థసంగ్రహ మనగా జీవయాత్ర కావశ్యకమైన యుపకరణ సంధానము. జీవయాత్ర యనగా వ్యక్తిత్వదశ. యాత్రయను పదమునకు సాధనరూపమైన ప్రవర్తన యని అర్థము. ఈ వ్యక్తిత్వదశ కాలబద్ధము గాన యాత్ర యను పదము సమంజసము. ఉపకరణ మనగా భూతసముదాయము. ఉపకరణ పదప్రయోగ సామంజస్యము సాధకపదసమన్వయమున తేటపడును. మన మిదివరలో వైరుధ్యభావమును నిరూపించి యుంటిమి. అందువలన సంహార మనవలెగాని సంధాన మనుట యెట్లు? అర్థ సంగ్రహమందు ఉపకరణములను సమకూర్చుటయే ముఖ్యాభిప్రాయము. ఈసమకూర్చుట సామ దాన భేద దండోపాయములచే సిద్ధపడును. దండోపాయము సంహారము. సంధానపదప్రయోగము సర్వోపాయ సమన్వయ ద్యోతకమగును. కావున సంధానపదమే యోగ్యము. అది యునుంగాక యీ చతుర్విధోపాయములు శత్రువశీకరణమందు వర్తించునుగదా? అందు వైరుధ్యభావము గానంబడు. ఈవశీకరణము శరణ్యమిచ్చి కూడ పొందవగు. ఈ శరణ్యపద్ధతి సంయోగములో నన్వయించును. ఈ వైరుధ్యభావము విధింపబడిన కారణమున, భూతములలో బలము, దౌర్బల్యము ఏర్పడుట చేతను, ఉపకరణ సంధానము సామదాన భేద దండోపాయములచే జేకూరుటచేతను, భూతములకు వృత్తి భేదము తటస్థించుచున్నది. ఈ వృత్తిభేదములకు ఈశ్వరుడు

అనగా పాలకుడు నియమముల నేర్పరుపవలసి వచ్చినది. ఇందులకు కారణమేమన, వైరుధ్య భావమందు అహంకార విజృంభణము కలిగి, ప్రాణులు స్వార్థపరతచే నిర్మూలనము గావించుకొనుట తటస్థించును. కాన సర్వప్రాణులు అర్థసంగ్రహము యథావిధిగా నొనర్చుటకు వీలుగలుగ జేయుటయే నియమములయొక్క లక్ష్యము ఇదియే ధర్మస్వరూపము. ప్రాణులు యథావిధిగ నర్థ సంగ్రహము జేసినపుడే ఆత్మోపలబ్ధి చేకూరుగావునను ఆత్మోపలబ్ధి లక్ష్యమందుంచుకొని యాచరించుకర్మ అకర్మముగానను ఈ యర్థసంగ్రహము జేయుచున్న జీవయాత్ర ధర్మబద్ధమై యుండవలయును.

అర్థములు భూతసముదయములు; సమస్త భూతములును పాకాది పరిణామమును పొందినగాని భోగ్యములు గావు. అపుడే అవి యర్థమగుచున్నవి. ఈ పాకాది పరిణామమునకు సాధనయే నియమము లేర్పరచును. ఆనియమములకే మనము 'విలువ' **(Both value in rate and value in exchange.)** యని పేరిడుచున్నాము.

## పాశ్చాత్య అర్థశాస్త్రము.

"Economics is the science which deals with the ordinary business of man." (Marshall.)

"Political Economy is morally colourless" (Nicholson.)

పాశ్చాత్యదేశములందీ యర్థపురుషార్థసిద్ధికై శాస్త్రములనేకములు వెలువడినవి. ప్రస్తుతకాలమందు పాశ్చాత్య

పరిపాలనకు లోనైనదేశము లన్నిటియందు, ఆశాస్త్రమే యించుమించుగా వర్తించుచున్నది. ఈయర్థశాస్త్రభిప్రాయము, ద్రవ్యార్జన మొనర్చు సాధనములు, ద్రవ్య స్వభావ నిరూపణము, ద్రవ్యవ్యయమును ద్రవ్యపరిణామమును, మార్పును, ధనసంపత్తియొక్క వృద్ధినష్టములును, ప్రభువులకు ద్రవ్యార్జన ద్రవ్యవ్యయ పద్ధతులు మొదలగు శాఖలతో నేర్పడియున్నది.

(The Science of Economics is divided into the following branches (1) Production (2) Distribution (3) Exchange (4) Economic progress or retrogression and (5) Public finance.)

ఇందు ధర్మవిచార మేమాత్రమును లేదు. ధర్మవిచార మున్నచో ఆర్జించుపద్ధతి, వ్యయముచేయు పద్ధతికూడ ధర్మబద్ధమై యుండవలసివచ్చును. అట్లున్నచో సర్వభూతహితము వర్తించును గనుక సర్వభూతహితము లేక ఆత్మోపలబ్ధియే లక్ష్యస్థానమందు లేక ద్రవ్యముయొక్క ఆదాయవ్యయములు జరుపుచున్నారు. కాననే వైరుధ్యభావము వృద్ధినొంది ప్రస్తుత కాలమున, పాశ్చాత్య ప్రజాప్రభువులు ఘోరసంగ్రామార్ణవ నిమగ్నులై యవాచ్యమగు బాధల నొందుచున్నారు. ధర్మబద్ధముగాని యర్థసంగ్రహ విధానము మనము మనజీవనమం దేర్పరచుకొనినచో, మనకును నట్టి దుర్గతియే వాటిల్లి రాక్షసులమై ఆత్మోపలబ్ధికి సాధనస్థానమగు వ్యక్తిత్వదశను నరకతుల్యము గావింతుము. శాస్త్రలోపము తదాచరణమందు

దుష్ఫలము నిచ్చును. శాస్త్రనిర్మాణము ఆచరణయోగ్యముగ నుండవలయును. శాస్త్రమందు ధర్మవిచారణ లేక విషయవిచారమును జేసినచో, కేవలము నిష్ప్రయోజక జ్ఞానము లభించుటయేగాక, ముఖ్యముగ పామరుల వర్తనమునందు ధర్మదూషణమును నెలకొల్పును. ధర్మవిచారణలేని శాస్త్రములు అధర్మవృత్తి స్వభావమునే యెఱుఁగుట కుపయోగపడును. అట్టివి కేవలము ధర్మస్వరూపులైన పండితులకును ధర్మస్వరూపులైన ప్రభువులకును దుష్టశిక్షణకై సహకారిగా నుండునేకాని జనసామాన్య విద్యాపద్ధతుల కుపయోగింపవు. అల్పబుద్ధుల కవియే సిద్ధాంతములుగఁ బొడకట్టి, వారికి దుర్వృత్తి నలవడజేయును. అదియునుగాక ప్రస్తుతకాలమందలి విద్యాపద్ధతులలో సమన్వయ మేమాత్రమును లేకయుండుటచే నిట్టి కుశాస్త్రములకు, కుతర్కములకుఁ బ్రాధాన్య మొసంగును. అందువలననే మనదేశమందును విద్యావంతులమని విఱ్ఱవీగువారు 'భుక్తి కుదిరినగాని ముక్తి కుదుర'దను మిథ్యాన్యాయములలో వ్యవహారము నడపుచుందురు. ఈపాశ్చాత్య శాస్త్రములందు ముఖ్యముగ నర్థశాస్త్రమున నున్న యీలోపము సర్వ ప్రపంచమును ప్రస్తుతము కలవరపరచుచున్నది. ముక్తియే జీవితాశయమని యెన్నబడు నీదేశమునఁ బాశ్చాత్య శాస్త్రవిజృంభణాపిశాచమును విమర్శనాకృపాణముచే ఖండింపవలసిన యవశ్యకత మనకు ఘటిల్లించినది. అందువలన అర్థపద్ధతియందు పాశ్చాత్యశాస్త్రవిచారణ పూర్తిగ జరుగవలెను.

# అయిదవసూత్రము - మోక్షము.

జీవుని సుఖదుఃఖ జననమరణాది ద్వంద్వ సంకులంబగు సంసారావస్థావిమోచన మోక్షము. [ద్వంద్వావస్థా మోక్షము మోక్షము]

దాని స్వరూప మెట్లుండునో, స్వరూపానంతరమున దాని పరిణామ మెట్లుండునో మనము తెలిసికొనుట యావశ్యకము.

## జీవితములోని మోక్షార్థక వివిధావస్థలు.

1. సామాన్యస్థితి, అనగా కేవల అవ్యక్తస్థితి. బాల్యస్థితియందు ద్వంద్వములు లేవు.

2. సుఖదుఃఖముల స్వభావము దెలిసికొని, వాని సమన్వయము చేసికొనినప్పుడె యోగస్థితి చేకూరును. (గీత 2.48) సంగత్వము పోవుటయే, యీస్థితియొక్క లక్షణము. ద్వంద్వములనుండి నిస్సంగత్వస్థితి.

3. సమాధిస్థితి — అనగా సంపూర్ణ ద్వంద్వ రాహిత్యము.

4. తురీయావస్థ - బ్రహ్మైక్యము.

ద్వంద్వముచేత కట్టుబడకుండుటయే సంసారావస్థా మోక్షము. సామాన్యజీవునికి వ్యావహారిక స్థితియందు వర్తించుచున్నప్పు డవస్థాభేదము లనేకములు గలుగునుగదా. అట్టి యవస్థలకు తద్వర్తమానకాలమందు సంపూర్ణత్వము కలిగి

తదితరావస్థలయందు మిథ్యాత్వము గ్రహింపబడుగదా. ఇప్పుడు మనము చెప్పిన ద్వంద్వరహితావస్థాభేదములయందు రెండవదియగు ద్వంద్వముచే కట్టుబడక ద్వంద్వముననే కర్త నాచరించుట, అనగా యోగత్వసిద్ధి చెందుటయనునవస్థయందు, మోక్షసిద్ధి కల్గునని మనము చెప్పియుంటిమి. ద్వంద్వమందు కర్మాచరణలో అవస్థాంతరములు కలుగును గనుక, నిట్టి యోగికికూడను అవస్థాభేదము లున్నవా లేవా?

సర్వావస్థలు ద్వంద్వాశ్రయములు. ద్వంద్వరాహిత్యము సర్వావస్థల నాశనము..........................
**2, 3, 4** లో అవస్థాపదప్రయోగము కేవలము సంజ్ఞా మాత్రమే కాని స్వరూప (స్వభావమును నిర్ణయించునది కాదు.)

[సాధన చతుష్టయము—

(1) నిత్యానిత్య వస్తువివేకము – **మూలపదార్థ** మననేమియో కూడ తెలిసికొనవలెనని కోర్కెకూడ నుండరాదు. (మోక్షము పొందువానికి) సిద్ధునికి కోర్కె లుండవు. (2) ఇహాముత్ర ఫలభోగ వైరాగ్యము. (3) శమదమాది షట్కసంపత్తి – శమము, దమము, శ్రద్ధ, తితిక్ష, ఉపరతి, సమాధానము. (4) ముముక్షుత్వము— మోక్షేచ్ఛ. ఈ నాలుగునుండిన గాని మనము **మోక్షార్హులము** కాము.]

# ఆరవసూత్రము - విద్య.

విద్యయే పురుషార్థ సాధకము :— విద్య యన నేమి? విద్య క్రియావాచకము; క్రియ ధాతురూపము; భూతముల సంయోగ వియోగాత్మకమైన కర్మము, అనగా విద్యను పురుషుఁడారాధించినచో భూతములతో సంయోగముగాని, వియోగముగాని, యీ రెండును గాని తటస్థించును. ప్రతిక్రియకు భూతము లేక కర్మ విద్య యను కర్మాచరణకు జీవాత్మయే కర్త. జీవుఁడన నెవరు? వాని స్వరూపమేమి? – ఛాందోగ్యోపనిషత్తు 3.14 (1)

(Man is a creature of reflection. What he reflects upon, that he becomes).- కౌశీతకి ఉపనిషత్తు 1,6; కఠోపనిషత్తు. 3, 1లు జీవాత్మ పరమాత్మల భేదాభేదముల సూచించుచున్నవి. శ్వేతాశ్వతరోపనిషత్తు యందు జీవాత్మకు భోక్తయని పేరిడబడినది. (1- 8, 9, 12) జీవాత్మకు పరమాత్మకు గల భేదమేమన, పరమాత్మ ఉపాధిసహితమైనపుడు, జీవాత్మ యని ఉపనిషత్తుల తాత్పర్యము. అయిన పరమాత్మ యేల జీవాత్మస్వరూపము దాల్చవలె? దీనినిగూర్చి ప్రశ్నోపనిషత్తులో 3వ ప్రశ్నయందు చర్చింపబడినది. జీవాత్మస్వరూప నిరూపణమును, జీవాత్మ పరమాత్మలకు గల సంబంధ సాదృశ్య సజాతీయానన్యత్వములును ఉపనిషత్తు లన్నిటి

యందును విచారింపబడినవి. కాని, జీవాత్మకు మూలకారణ మెద్దియో నిరూపింపబడలేదు. దీని గూర్చిన చర్చనే పాశ్చాత్య తత్వవేత్తలు, "The doctrine of the final cause" అని యందురు. జీవాత్మావతరణమునకు మూలకారణ మేదియో విచారించుటకు అనాదినుండి ప్రయత్నించిరి. ప్రస్తుతకాలమున కూడ ముఖ్యముగా Bergson అను ఫ్రెంచితత్వజ్ఞుఁడు ("Elan vital or original impetus") ప్రాథమిక విజృంభణము అను సిద్ధాంతమును (Immediacy) ప్రతిపాదించిరి. [ప్రత్యక్షమున స్వానుభవము ఊతగాగొని జ్ఞానార్జనచేయుట (Inductive process). స్వానుభవము పరోక్షమునకూడ గలదు. అపరోక్షము. Reality or higher Immediacy.]

ప్రత్యక్షానుమాన సిద్ధాంతమువలన, సాఫరు అనునాతఁడు జీవపదార్థముయొక్క స్వరూపమును గుర్తెరుంగుటకువీలు లేదని యును (It will be changing every minute), దీనికి మూలకారణ మిదమిత్థమని నిరూపించుటకు మనకు శక్యముకాదని యును శాస్త్ర (Science) రీత్యాకూడ అశక్య మనియును, బ్రిటిషు అసోసియేషనుకు అధ్యక్షుఁడుగా నున్నప్పుడు ప్రారంభోపన్యాసమున నుడివెను. క్యాంటు అను జర్మనువిద్వాంసుడు జ్ఞానాన్వేషణము గావించునదియు, మూలపదార్థము నెఱుంగవలసినదనియు, బుద్ధి (Reason) యని యెఱింగి, యీ బుద్ధియొక్క స్వభావము మొందు గుర్తెఱింగినగాని బుద్ధి సూతగా చేసికొను పదార్థము తెలుంగబడదని, బుద్ధియొక్క స్వభావము విమర్శింప నుద్యమించి, తుదకు "Critique of Pure Rea-

son" అను గ్రంథమున బుద్ధి దేశ కాల కార్య కారణ సంబంధములతో కట్టుబడి యున్నదనియు, అందువలన జ్ఞేయ పదార్థ మెప్పుడును నిటులనే కట్టుబడి యుండుననే గ్రహింప బడుననియు, దీని నతిక్రమించిన యెడల ఆస్థితిని యిద మిత్థ మని చెప్పుటకు వీలు లేదనియు, సిద్ధాంతీకరించెను. కనుకనే మూలపదార్థమును పదార్థ సంజ్ఞతోనే గ్రహింపనగును గాని తదితరముగా బుద్ధిచేత గ్రహింప నలవిగాదు. కావున వీని నన్నిటిని బట్టిచూడ, మూలకారణ మగోచరమని తేలుచున్నది. అట్లగోచరమే అయినచో, ఎందువలన నగోచరము? అగోచరత్వము దేనిని స్ఫురింపజేయును? ఈ విచారణ సల్పుట కాధారము అగోచరత్వమన మనకు సంపూర్ణ విశ్వాసమే. ఎందువల్ల మన కిది అగోచరము? (In all forms of Enquiry, there is nothing but mere self-objectification).

అజ్ఞానదశను, నిరుపేదకు సంపద ఘటిల్లినప్పుడు కలుగు ఉన్మాదావస్థకు పోల్పవచ్చును. ఎట్టి విచారణజేసినను, ప్రతి జీవియు తనకు భోగ్యరూపము, జ్ఞేయరూపము కల్పించుకొని విచారణచేయును. కార్యకారణము లనంతముగా విస్తరించుటకు కారణ మిదియే. ప్రతిప్రశ్నయందును తాను కర్తగ నున్నాడు. తననుగూర్చిన ప్రశ్నయందుగూడ తానే కర్తగా నున్నాడు. తా నట్లు కర్తగా నున్నప్పుడు (నుండుట) తనకు కర్తృత్వస్థితి యోగ్యమని భావించియేగదా, నిత్యమని భావించియే గదా, సిద్ధమని భావించియేగదా? అట్లు భావింపనిచో, తన్ను

దానే మిథ్యగా భావించినచో, ప్రశ్నయే యసంగతము. తానునుఁ దనయొక్క నిత్యత్వము నంగీకరించిననే యట్టిప్రశ్న నిలువగలదు.

ఇక నీరీతి తననిత్యత్వము నెఱింగియు, ప్రశ్న వేయుట కేవలలీలగదా! ఇందులకుదాహరణము ప్రతిధ్వని. అనంతమైన కారణ కార్యచక్రమునకు కేంద్రస్థాన మధిష్ఠించినవాడు జీవుడు లేక వ్యక్తి. ఈచక్రపరిభ్రమణమున నాకులుగా నుండు కార్యకారణములు ప్రతినిమిషమును స్థానభ్రష్టత నొందును. కాని కేంద్రము స్థిరముగా నుండును.

కార్యకారణ చక్రము ప్రశ్న పరంపరాత్మకము. ప్రశ్నయన ఆత్మయొక్క కర్మార్థకము (Self-objectification) కాన కార్యకారణచక్ర మంతయు (ఊర్ణనాభి తార్కాణము ననుసరించి) మననుండియే యుద్భవించినది. బృహదారణ్యకము ప్రథమాంధ్యాయములో మొదటి వాక్యములో "ఆత్మన్వీస్యామితిMay I have a soul." "తన్మనోనుకురుతన్వీస్యామితి" He created this mind desiring, "May I have a soul."

'జీవు'డను పదార్థమునకు నిర్వచనము చెప్పవలసి వచ్చినపుడు, మనకుఁ దెలిసిన పదార్థము మనమే గాన, మనతో సంబంధము చెప్పవలెను. మనతో సంబంధ మేమి? మనతో సంబంధము మనము. బ్రహ్మము లేక జీవాత్మయనెడి విచారణీయాంశము ప్రశ్నరూపకముగా నావలననే సృజింప బడినది. గాన ఆ ప్రశ్నలో సర్వసంపూర్ణత్వము కోరు

చున్నాము. అందువలన మనకుఁ దెలిసిన పదార్థములలో సర్వసంపూర్ణత్వము కలిగినది "నేను" గనుక, ఆ బ్రహ్మము, జీవునికి సర్వసంపూర్ణత్వమే యుండవలసిన యెడల, తెలిసిన పదార్థమైనట్టువంటిన్ని సర్వసంపూర్ణత గలిగినట్టిన్ని "నా"తో అనన్యత్వమే చెప్పవలసి యుండును. కావున జీవబ్రహ్మల కనన్యత్వము దెల్పుచు, జీవాత్మ పరమాత్మల కుండు సంబంధ మందు భేదము కూడ నిరూపించుచు, జీవాత్మకు భోక్తృత్వము సిద్ధాంతీకరించుచు, బ్రహ్మమునకు సాక్షిత్వమే నిరూపించుచు, విద్యారూపమైన కర్మాచరణకు జీవుడే అధికారి యని యెఱుంగుచున్నాము. (కఠోపనిషత్తులు III. 3-1-12)

అజ్ఞానమే శత్రువు. దానిని జయించునది విద్య. జీవాత్మ యొనరించు ప్రతి కర్మయు విద్యాస్వరూపమే. సమస్తకర్మలును విద్యాస్వరూపములే. కర్మ పురుషార్థమూలకము. కావున విద్య పురుషార్థము. భక్తి జ్ఞాన కర్మ మొదలగునవి యెల్ల విద్యాసాధనములు. (కేనోపనిషత్తు II-౩).

విద్యాపరమున "సంయోగవియోగ" భావములను విమర్శింపవలసి యున్నది. (1) సంయోగము=గ్రహణము. (2) వియోగము=విసర్జనము. (1) భూత తత్త్వ గ్రహణము. శబ్దాదిరూపమున ననుభవమందు జీర్ణింపజేయుట. (2) వియోగము - ఇది మూడువిధములు. పదార్థస్వరూపవిసర్జనము, స్వమనో అయిష్టత (our own individual distaste), ధర్మ నిర్దిష్టము (Social convention).

జీవిత విద్యాలయము.




[బ్రహ్మచర్యము is the dawn of egoistic consciousness (అహంకారం) చిత్తవృత్తి విజృంభణము విస్తారమగుటచే, తన్నిరోధార్థము బ్రహ్మచర్యము-విద్యాసాధనము-During Brahmacharya Education is dogmatic.]

## ఏడవ సూత్రము.

భక్తి జ్ఞాన కర్మయోగములు విద్య - ఈసూత్రము విద్యకు, తక్కినవానికి గల సమన్వయము నిరూపింప నేర్పడును.

## ఎనిమిది తొమ్మిది పదవ సూత్రములు.

ధర్మార్థసాధకము - కర్మయోగము.
కామార్థసాధకము - భక్తియోగము.

మోక్షార్థసాధకము - జ్ఞానయోగము - కావున చతుర్విధపురుషార్థములుగా విద్యావిధానము విభజింపబడినది. 'యోగశ్చిత్తవృత్తినిరోధః' - పతంజలి. ఈ సూత్రమందు చిత్తవృత్తులలో కొన్ని యోగభంగకరములని స్ఫురించుచున్నది. అంతియేగాక, ఆయోగభంగకరములగు చిత్తవృత్తులకు మోక్షము లేదనికూడ స్ఫురించుచున్నది. అయితే సమస్త చిత్తవృత్తులును పదార్థములందు లీనమగుటయో లేక అంతఃకరణమందే ఉపసంహరింపబడుటయో వ్యాపారావసానముగా కలిగియుండును. ఈ రెండవస్థలును యోగమే. పదార్థములకు పదార్థతయందులీనము యోగమే. ద్వితీయావస్థ ప్రమాణము. పదార్థములందు లీనమైనపుడు పదార్థతయందు యోగము సిద్ధించును. వ్యావహారికమందు మాత్రము అవస్థాభేదములవలన, చిత్తవృత్తులు యోగభంగములుగా కనబడును. అది ప్రకృత స్థితి. నిజస్థితియోగమునవే వర్తించుట. కనుక నిరోధమన చిత్తవృత్తుల వ్యాపారమునందు యోగాశయమును గ్రహించుట.

జీవవిశ్వముల సంబంధము గల్గించు నుపాధి అంతఃకరణము. దీనికి మనోబుద్ధిచిత్తాహంకారములు వృత్తులు. ఇది జ్ఞానకర్మేంద్రియ వ్యాపారసంబంధము. (1) వాక్పాణి పాదపాయూపస్థ. (2) త్వక్చక్షు శ్రోత్రజిహ్వా ఘ్రాణస్థూలసూక్ష్మ సంబంధములు గలవి.

అంతఃకరణము. (Government)



వీనిద్వారా బహిస్సాంగత్య వ్యాపారము (ఉపాధి సంగతమైనప్పుడు). ఇట్టిచో నిరోధ మననేమి? విద్యాభాగ మగు విసర్జనము నిరోధాత్మకము (గీత 2-58). చిత్తవృత్తి నిరోధమనగ దానిని సంకుచితపరచి లక్ష్యమార్గమున నియోగించుట. విసర్జనమనగా తద్భిన్నత పదార్థములకు గ్రహణయోగ్యస్థితి కల్పించుట.

## పదునొకండవ సూత్రము.

మన స్వధర్మ స్వభావములయందు ఐక్యమొందుటకు యోగ్యరూపమును కలుగజేయుట యోగము (ఐక్యము పొందుటయే). వర్గానుసారముగా వివిధవస్తువుల యనన్యత్వము సిద్ధాంతీకరించి, యాదశాభేదమున సాధకుడు తన స్వభావముతో సమన్వయము చేయుటయే "సమత్వం యోగ ఉచ్యతే" అను దానిభావము. ప్రతీవ్యక్తియు త్రిగుణాత్మకము. సత్వరజస్తమః; ఈ పరిణామము ననుసరించి వీరి వ్యాపార భేదము.

(1) సత్వ - జ్ఞానకర్మ
(2) రజ - భక్తి ,,
(3) తమ - కర్మ ,,
} యోగస్థితి.

ఇందువలన నాల్గు పురుషార్థ సాధకములగు మూడు యోగముల సమన్వయము విద్య. కావున విద్యావిభజనము నాలుగు పురుషార్థములనుబట్టి

# పండ్రెండు పదమూడు పదునాల్గవ సూత్రములు.

౧౨. సర్వజ్ఞానకర్మేంద్రియవ్యాపారములఆశయము యోగము.

౧౩. సర్వకర్మలు విద్యాత్మకములే.

౧౪. విద్యకు పురుషార్థసిద్ధియే లక్ష్యము. విద్యకు పురుషార్థసిద్ధియేగాక యనేకలక్ష్యము లుండవచ్చును.

ఉదా:- (1) (The bread-and-butter-aim of the present system of education) విద్యావిక్రయము. నౌకర్లలో కొనుట, ఆఫీసులలో నమ్ముట. (2) Indirect selling స్త్రీలకు మర్యాదకొఱకు (as an accomplishment) సంగీతము (3) మోసముచేయుటకు, హానిచేయుటకు (To manufacture armaments, as in Europe and to practise మంత్ర శాస్త్రము), (4) Citizenship - గృహస్థునిగా తయారుచేయుట. కాని ఇంతకంటె నెక్కువ ఆశయముకూడ గలదు. వానప్రస్థులు, సన్న్యాసులు వారి ధర్మములను వారే శాసించుకొని ధర్మశాసను లగుచున్నారు. గృహస్థునకు ధర్మశాసనమున పాల్గొనుటకు అధికార మియ్యబడినది. అయితే ధర్మశాసనార్హత స్వతస్సిద్ధముగా జనింపవలయునే గాని, ఒకనిని నీవధికారి యనినంత మాత్రమున కానేరదు. ఇట్లధికారారోపణము చేయుట చావునకు పూర్వము సన్న్యాస మిప్పించుట వంటిది. కావున విద్య కివి లక్ష్యములు గావు; సాధనారూపములును గావు.

కాన విద్యకు సాధనరూపమైన, అనగా సమ్యగ్దర్శనమును సమకూర్చునట్టి లక్ష్యమే ప్రధానము. అట్టి లక్ష్యము పురుషార్థసిద్ధియే.

జీవితము విద్యాలయము. ఇందు నేర్చుకొనవలసినవి ధర్మార్థకామమోక్షములు. ఈ నాలుగు విద్యలలో నాలుగు తరగతులు (Faculties) బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్యాసము. ప్రతి క్లాసునకు నాలుగు డివిజనులు. ఇందు బ్రహ్మచర్యము విశేషకాలము నియమింపబడినది. 5-8 సంవత్సరములకు చిత్తవృత్తి విజృంభణ ప్రారంభమగును. దీనిని నిరోధింపవలెను. అందులకే అది యంత విశేషకాలము నియమింపబడినది. సాక్షిత్వస్థితి యనగా భరింపగల భర్తృత్వము సిద్ధించిన గాని, గార్హస్థ్యమున కర్హులము గాము. బ్రహ్మచర్యమువలన సాక్షిత్వము సిద్ధించును. ధర్మార్థములు గృహస్థాశ్రమమున సాధన చేయవలెను. మోక్షమున ధర్మశాసనుడగుచున్నాడు. వానప్రస్థమున రససిద్ధి - కామపురుషార్థసిద్ధిరూపకల్పనచేయుట.

# పదునైదవ సూత్రము.

అనగా పురుషార్థసిద్ధికి వలయు విషయ విషయి జ్ఞానము విద్య సమకూర్పవలయుననుట.

ఇచ్చట జ్ఞాన మను పదము ప్రధానత్వమే సూచించుచున్నది. విద్యను సంపాదించుటయందు జ్ఞానము ముఖ్యము. జ్ఞానకర్మ యనగా జ్ఞానేంద్రియ వ్యాపారము. త్వక్చక్షు

శ్రోత్రిత్రి జిహ్వాఘ్రాణములు జ్ఞానేంద్రియములు. విషయము ప్రకృతి; విషయి పురుషుడు. వివిధ పురుషార్థములయందు ప్రకృతి పురుషులకు సంబంధము భేదించుచుండును. ధర్మమున మిత్రత్వము; అర్థమున శత్రుత్వము; కామమందు ప్రణయము; మోక్షమం దైక్యము; కావున బురుషార్థసిద్ధికై యాచరింపబడు కర్మ, అనగా విద్య, ప్రకృతి పురుషస్వభావ స్వధర్మముల నిరూపింపవలయును. విషయి విషయములు పురుషప్రకృతులు. విషయమును గూర్చిన జ్ఞానము పాశ్చాత్త్యులచే "Natural Sciences" అని పిలువబడు చున్నవి. విషయి జ్ఞానము "Mental Science" అని పిలువబడుచున్నది. కాని విద్య విషయి, విషయజ్ఞానముల రెంటిని సమ్మేళనము చేయవలె గాన, ధర్మార్థకామ మోక్షపద్ధతిని విభజించుటయే సమంజసము. విద్యకు పురుషార్థసిద్ధియే లక్ష్యమని చెప్పుటచేతను, విషయి విషయజ్ఞానము పురుషార్థసిద్ధికే యుపయోగించును గనుకను, నాలుగు పురుషార్థములుగ విభాగింపబడినది.

## పదునారవ సూత్రము.

సర్వవ్యక్తులును నీ నాలుగుపద్ధతులయందే విద్య నభ్యసింపవలెను. "సర్వవ్యక్తు"లను పదమందు కేవలము మనుష్యవ్యక్తులే సూచింపబడినవి. ఏలనన తదితరము లైన తిర్యగాది వ్యక్తులకు విద్యాధికారము లేదుగదా! కాని సర్వ కర్మలు విద్యాత్మకములే యను సూత్రప్రకారము, తిర్యగాది

వ్యక్తులు గూడ కర్మ నాచరించుగాన వీని కర్మకూడ విద్యాత్మకమేనా? ఇచ్చట ప్రకృతికర్మలకు, కల్పితకర్మలకు, భేదము నారయవలయు. ప్రకృతికర్మలు సహజమై సంకల్పశూన్యములైనవి. కల్పితకర్మలు సంకల్పజన్యములు, అంతఃకరణ ప్రేరితములు. తిర్యగాదివ్యక్తులయందు జ్ఞానేంద్రియములు సంపూర్ణముగ నుండవు. ఉదాహరణ తిర్యగ్జంతువులు - కీటకాది; త్వక్ నత్తగుల్ల; శ్రోత్రేంద్రియమునకు పాము; చక్షువు-గ్రుడ్డి, పసగ; ఘ్రాణము- మాంసఖాదులు; జిహ్వ - పక్షులు, కోతులు. జ్ఞానేంద్రియవ్యాపారము సంపూర్ణముగా నుండనిచో కల్పితకర్మ సృష్టిపొందనేరదు. అంతఃకరణము సంకల్పజనకము కానేరదు. (Every volitional act presupposes judgment and judgment proceeds from a syllogism of perceptions. All perceptions are born of sensations and sensation is the result of the activity of the senses. Therefore a complete activity and co-operation of all the senses is essential for conscious activity)

కాబట్టి తిర్యగాదులకు జ్ఞానేంద్రియవ్యాపారము లేదు. గాన విద్యాధికారము లేదు. కావున వ్యక్తు లనగా మనుష్య వ్యక్తులే యని సూచితము.

## పదునేడవ సూత్రము.

ఇందు చతుర్విధాశ్రమరీతి ననుష్ఠింపవలయును.

# పదునెనిమిదవ సూత్రము.

అధ్యయనపద్ధతి గుణకర్మ భేదవశమున చతుర్విధ వర్ణభేదముల ననుసరించి ప్రతి యాశ్రమమున జరుపబడ వలయును.

కర్మాచరణమునఁ గడగు యజమాని తన శ్రేయస్సుకు భంగకరముగ వర్తించుట యసంభవము. అచింతితముగ నైన నట్లు వర్తించుట యసంభవము. కావున వ్యష్టియందు ధర్మేతరకర్మ కానబడదు. వ్యష్టియను పదము వ్యక్తి జీవనమున నొక విశేషమునుఁ దెలుపును. ఏకాంతస్థితి వ్యష్టిగ భావింపనగు. ఏవ్యక్తి యైనను ఏకాంతమునం దున్నప్పుడు సజాతీయమైన యేయితర వ్యక్తితో నైన వ్యావహారికాసక్తత్వము (Identity of interest) గలిగియుండక కేవల స్వార్థాన్వేషణమును, పదార్థములలో జోక్యముఁ గలుగఁజేసికొన కుండుటయు నతనికి యలవడును. ముఖ్యజీవితాశయమునుఁ గలిగియున్నస్థితి విశేషము వ్యష్టి యనఁబడు. వ్యష్టి యను జీవితపద్ధతియందు స్వాత్మేతర వ్యక్తులతో సంబంధబాంధవ్యము లుండగూడదను తాత్పర్యము లేదు. ముఖ్యముగఁ దనంతట తాను జీవనము చేసి యితరులతో వ్యవహార సమయములందే యేదియైన సంబంధము కలుగజేసికొని కార్యసానుకూలానంతర మా సంబంధము విడనాడి, కేవల స్వతంత్రజీవనముఁ గావించుట వ్యష్టి యనఁబడు. బ్రహ్మచారి, సన్న్యాసుల జీవితపద్ధతి వ్యష్టియని చెప్పవచ్చు. గృహస్థులు సమష్టిజీవనముఁ జేయుదురు. సమష్టిజీవనము

గృహస్థులే చేయనధికారముఁ గలవారు. ఈ రెండుపదములు ప్రజాసంసారమునందు (Social life) వ్యవహరింపఁబడును. అనార్యజాతులయందును, ఆధునిక నాగరకులయందును వ్యష్టి జీవన మెక్కుడుగఁ గాన్పించు. ఇందులకుఁ బ్రబలకారణము లెవ్వియన (1) విశ్వమందు ఇంద్రియగోచరమగు నానాత్వమే నిశ్చితార్థమని భావించుటచే, ప్రతివ్యక్తియుఁ దనశ్రేయస్సునే ప్రధానముగ గమనించుట తటస్థించును. అందువలన సమష్టిస్థితి తాత్కాలికమును నిమిత్తమాత్రమునై యుండును. (2) ఈ కారణము చేతనే శాశ్వతసంబంధాభిప్రాయ మేప్రాణికిని నితర ప్రాణులయందుఁ గలుగకుండుటచేత, వైరుధ్యభావమే ప్రధానమై, దేహబలమే సాధనమార్గమై, సుఖదుఃఖాది ద్వంద్వావస్థకు సంసారమందు శాశ్వతస్థితి గలదను నంశమును విశ్వసింపఁ జేయుచు, వర్తమాన కాలమునఁ గాన్పించుచున్న "Survival of the fittest" అను పాశ్చాత్యసిద్ధాంతము కర్మాచరణమును నడుపుట (3) గుణకర్మలింగభేదములవలనఁ జీవితమందు వ్యక్తులకు వేర్వేరు సాధనమార్గములు, వేర్వేరు ఫలములు గలుగుటయు, నీ భేదమంతయు బాహ్యముగ నుండి, ఆంతరంగికమం దైక్యముఁ గలిగి వేర్వేరు సాధనమార్గములకు గమ్యస్థాన మొక్కటియు; దత్ఫలానుభవజన్యమైన యానంద మొక్కటియు ననుజ్ఞానము లేక యీ భేదములను పాటింపక, వ్యక్తిత్వదశయందు సయితము ప్రాణులకు భేదత్వ మారోపించుట యసభ్య మను మూఢ

విశ్వాసమును (4) సాధన మార్గముగ స్వీకరింపఁ బడుట.
ఉదా : బ్రహ్మచర్య, సన్న్యాసాది యాశ్రమములు.

వ్యష్టిస్థితియందు, ప్రధానాభిప్రాయ మేదియన వ్యక్తిత్వ జ్ఞాన ముండి యితరప్రాణులతోఁ దాత్కాలిక సంబంధమేగాని శాశ్వతసంబంధము లేనట్లు గ్రహించి కర్మ కెల్లప్పుడు స్వాత్మపరత్వమందె ప్రాధాన్య మొసగు జీవిత విధానముగ నెఱుఁగవలయు. అందువలన వ్యష్టిజీవనమందు సర్వకర్మాచరణకు సమర్థత, వ్యక్తి కావశ్యకమై యున్నది. ఇదియె యుత్తమ జీవితమార్గముగ నవలంబించు ప్రజలు ఈ విషయముఁ గుర్తెఱింగి వస్తుతః తమ కట్టి సమర్థత లేకుండుటకు వీలు లేదని చింతించి అనుభవమునందు కనఁబడు శక్తి తారతమ్యములు కేవల స్వయంకృతజన్యములుగ నూహించి, విద్యావిధానమునందలి మార్పుచే సమర్థతాసమత్వమును సంపాదింప నగునను విశ్వాసముతో వర్తింతురు. నిజస్వరూప జ్ఞానము గలిగినవా రచ్చటచ్చట గుణకర్మసమర్థతాభేదస్థితి నెఱిఁగి తదనుసరణముగ సాధనమార్గములఁ బ్రతిపాదింప నుద్యమించినను, వ్యష్టిజీవనసంజాత మగు హేత్వాభాసల నీయుద్యమములు నెరవేరకుండును. ఈ యభిప్రాయము వ్యష్టి జీవన మవలంబించు సన్న్యాసుల కుండినచో సార్థకంబగును. ఏలనన సన్న్యాసులు ఆత్మజ్ఞానసంపన్నులు. ఆత్మజ్ఞునికి సర్వ కర్మాచరణమందు జ్ఞానమును, అధికారము నుండును. అట్టి యధికారికె వ్యష్టిజీవనము యోగ్య మగును. సంపూర్ణాత్మ జ్ఞానము లేని వ్యక్తి వ్యష్టిజీవనమును స్వీకరించుట ధర్మస్వరూ

పము దోషరహితముగ నెఱుఁగకుండుటవలనఁ దటస్థించును. వ్యవహారమందు త్రివర్గపురుషార్థసిద్ధికై యాచరింపఁబడు సమస్తకర్మలు భోక్తృభోగ్యభావరహితముగ వర్తింపనేరవని స్పష్టముగ నెఱుఁగనగును. కర్తృ కారయిత్రుస్థితి లేని క్రియ యుండనేరదు. మోక్షపురుషార్థ సాధనయందే భోగ్యమునకు ఆత్మకు అనన్యత్వము గ్రహింపఁబడును గాని తదితరవ్యావహారిక జీవనమందు మాత్ర మట్టి స్థితి సంభవింపనేరదు. భోక్తృభోగ్య సంయోగములే కర్మకు ముఖ్యాంగములు గనుక భోక్తృభోగ్యసమావేశము సమష్టిగా నెఱుంగునది. సమష్టిభావము కాదను నాధునిక వ్యష్టిజీవన మార్గావలంబుల యభిప్రాయము మిథ్యయని యెఱుంగవలయును. ఎందువలన ననఁ పారమార్థిక చింతయందు దక్క తదితరవ్యావహారావస్థలయందు భోక్తృభోగ్యద్వంద్వభావములఁ దప్పించుకొనుటసంభవమనియును, వానియందు లీనమై వర్తించుటవలన నితరవ్యక్తులతో సంయోగవియోగసిద్ధి సర్వదా అనుభవింపవలసియుండును గనుకను, ఇదియె సమష్టిభావము యొక్క సారాంశముగఁ బరిగణింపబడుటవలనను, వ్యష్టిభావము భ్రాంతిమంతముగ నెఱుఁగనగును.

ఇట్టి సమష్టిజీవనమందు ప్రాణులు సంపూర్ణ పరస్పర సంబంధముఁ గలిగియుందురు. సంబంధము కర్మరూపముగ నుద్భవించును. కర్మ చతుర్విధపురుషార్థసిద్ధికై వినియోగించును. కనుక కర్మలయందు ధార్మికములు, ఆర్థికములు, కామ్యములు, మోక్షము లని నాలుగు ప్రధానభాగము లేర్పడినవి. ఈనాలు

గింటియందు గల రూపభేదములు తత్కర్తలయందుండు అధికారభేదము ననుసరించి యుత్పన్నము లగును. అనగా కర్మ సంయోగవియోగాత్మక మని మన మెఱుంగుదుము.........

కావున కర్మలన్నియు వస్తుతః ఒక్కటియే. వాని రూపములు మాత్రము వేరుగ నుండును. విద్యుచ్ఛక్తిచే వెలిఁగింపఁబడు గోళికలవర్ణమునుబట్టి వెలు గుండునట్లు, ప్రతికర్మయుఁ గర్తరూపమునే తాల్చును. కావున గర్మయందు గన్పించు భేదములు కర్తలలో భేదములు లేనియెడల గన్పింపవు గనుక కర్మాధికారము గల వ్యక్తులయందు భేదము లుండునని సిద్ధాంతము. ఈ భేదములే గుణకర్మ భేదములు..........

ప్రతి వ్యక్తియొక్క యంతఃకరణవృత్తుల రూపములు సంచితకర్మవలన గొంతవరకును, ప్రారబ్ధకర్మవలన గొంతవరకును, భేదించుననుట యిదివరకె విచారించితిమి. ప్రారబ్ధకర్మ విద్యాసేవానుసారిగనుక దానినిగూర్చి యిట వివరింపనవసరము లేదు. సంచితకర్మయే ప్రతివ్యక్తికి జన్మాదియందు సర్వగుణవిశేషములను బీజరూపముగ నెలకొల్పును. ఆ బీజగణము నా వ్యక్తియొక్క యంతఃకరణ పరిణామ నిర్మాతగా భావింపవలయు. ఈగుణములు సత్త్వరజస్తమోగుణ ప్రాధాన్యము ప్రకారము వ్యక్తులయం దెఱుంగవలయు. అనగా ప్రతివ్యక్తియందు ఒకదాని ప్రాధాన్యమును తదితర సామాన్యత్వమును, నెఱుంగవలయు. సత్త్వప్రధానులు బ్రాహ్మణులు. వ్యక్తిత్వదశ జీవునికి గుణస్వీకారమందే కలుగును. కర్మయను కుమ్మరి యీత్రిగుణములను మృత్తికచే జీవరాసుల యంతః

కరణవృత్తులను నిర్మించుచున్నాడు. ఈగుణముల నిజస్వరూప మును సంపూర్ణముగ నిట విమర్శింప నవసరములేదు. అనుభ వమునందు ప్రతివ్యక్తియందును నీగుణసమ్మేళనమే కలదని యెఱింగియున్నాము. సత్త్వప్రాధాన్యముగల వ్యక్తి శృంగార కరుణ శాంతాది రసభూయిష్టమగు క్రియాకలాపనమందు నిమగ్నుడై యుండును.

ప్రతి యాశ్రమమునందును విద్యావిధానము వ్యక్తుల యొక్క గుణప్రాధాన్యము ననుసరింపవలసియుండును. తద్గుణ సంపత్తియే సాధనమార్గమును నడుపవలయును. కనుక తద్గుణ భేదానుసారముగ ప్రతియాశ్రమమునందును వ్యక్తులను విడ దీసి, విధానభేదముగ విద్య నభ్యసింపఁజేయవలయు. వ్యక్తుల యందు గుణానుసరణమైన విభాగ మేదియనఁ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రత్వములు. శూద్రభాగము ముఖ్య ముగ అన్యజాతులతో సంపర్కమువలన నుద్భవించినది.

చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః,
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్. గీత 4-13

ఏవిధమయిన గుణకర్మ భేదములను గ్రహించినను ఈవిషయ మిచ్చట చర్చింప నవసరము లేదు. తద్భేదాంగీ కార మున్నయెడల, తదనుసరణముగ విద్యార్థులను, ప్రతి యాశ్రమమునందు ఆయా విభాగములుగ విభజింపవలెనను నంశమే యీసూత్రముయొక్క ప్రధానాభిప్రాయము.

## నాలుగవ అధ్యాయము.



# పురుషుఁడు – గురుకుల వాసము.

అంతఃకరణ మనుభవమార్గమందు సంచరించుచున్నప్పుడు నాలుగు విశ్రమస్థానములు (Stations) సహజముగ గనఁబడును. ప్రథమస్థానము (Self- consciousness) తన స్వస్వరూపముతోడనే యనుభవమార్గమున సంచరించుచుంటిననుసహాంకృతి రూపమైన జ్ఞానోదయము. ఈస్థితి వ్యక్తి యొక్క జీవితమందు అయిదారు సంవత్సరములు మొదలు పదిసంవత్సరములలో దటస్థించును. అహాంకృతియొక్క యుత్పత్తియు, వ్యక్తిత్వముయొక్క గోచరత్వమును (Consciousness) నీరెండును నొక్కటే. జన్మమునుండి యహంకారోదయమగువరకు, శిశురూపజీవి సార్వజనీనస్వభావమే (Universal) కలిగియుండును.

ఈ యహంకారోదయసూచనలు వ్యక్తిత్వ ముదయించుచున్నపుడె కన్పట్టును. ముఖ్యముగ, భేదబుద్ధి యుదయించుచున్నపుడు, వ్యక్తిత్వము, అహంకారము సంపూర్ణముగ నుదయించినవని గ్రహింపనగును. భేదబుద్ధి లేనిచో నహాంకృతి యుండదు. భేదబుద్ధియే ద్వంద్వావస్థాప్రవేశసూచకము. ద్వంద్వావస్థాప్రవేశ మయినప్పుడు జీవునికిఁ దత్ప్రత్యయములగు కామక్రోధాదిగుణములను పొడసూపును. ఈ వ్యక్తిత్వమే అనగా, ద్వంద్వావస్థాప్రవేశమే, అవిద్యాదశకుఁ బ్రా

రంభముగ నెఱుఁగవలయును. నిజస్వరూపము దేశకాల కార్య కారణ సంబంధాది యుపాధులచే నాచ్ఛాదింపఁబడి నానాత్వ రూపముఁ బొంది, జీవునికి భోగ్యముగఁ గన్పట్టును. ఈబహుత్వరూపముఁ బొందిన విశ్వమంతయు స్వాత్మ ప్రతిబింబమే యను జ్ఞానము కలుగకుండ నియహంకృతి అనగా నీ భేదబుద్ధి యాటంకపరచును. విద్యకు స్వాత్మదర్శనమే (Knowledge of oneself) ప్రధానలక్ష్యము. ఈకార్యమును నిర్వర్తించుటకు, ఈనానాత్వజ్ఞానమునకు గారణభూతమయిన భేదబుద్ధిగఁ బరిగణింపఁబడు కామక్రోధాద్యావేశనిబద్ధమైనచిత్తవృత్తియొక్క యిట్టి పరిణామవిశేషమును నిర్జించినగాని, విద్యాకర్మయొక్క ముఖ్యభాగము నిర్వర్తింపఁబడ నేరదు. నిజస్వరూప జ్ఞానమున కాటంకములు గల్పింప సమర్థతఁగలుగు చిత్తవృత్తిని నిగ్రహించుట విద్యాకర్మకుఁ బ్రథమావస్థ. పిమ్మట నిజస్వరూప మిదమిత్థమని భక్తిజ్ఞాన కర్మయోగ విధానరూపముగ విద్యార్థికిఁ దెలియబరచుట రెండవది.

విద్యావిధానములో బ్రప్రథమమున సాధకుని చిత్తవృత్తులను బాహ్యవిషయములనుండి మరల్చుట ముఖ్యము. కాని యిందువలన సాధకుని వ్యక్తిత్వమునకు హాని కలుగగూడదు. సాధకునియందు సంక్రమించియుండు కామోద్రేకములు విషయేచ్ఛలు చిత్తవైకల్యములు మున్నగు వానిని మాత్రము తొలగించి యాతని మనస్సును స్వయంజ్యోతియగు స్వస్వరూపమునకు మరల్పవలెను. ఈయహంకార విసర్జనకు సాధకము యోగము. పిమ్మట సాధకుని జ్ఞానేంద్రియ

కర్మేంద్రియములను నిరుపాధిక బ్రహ్మముయొక్క పవిత్ర వాయువు లాఘ్రాణించునట్లు చేయుటయే రెండవ సాధకము. వస్తుతః యీ రెంటికిని అభేదమే. మొదటి పద్ధతిలో విద్యార్థి యొక్క చిత్తవృత్తులను బాహ్యవిషయములనుండి మరల్చి తన వ్యక్తిత్వగుణములగు పరిసరములను బరికల్పించి తనకు వలయు సాధనసామగ్రిని సమకూర్చుట. రెండవది సాధకునికి విశ్వముయొక్క రూపము నెఱింగించి యందు తన స్వస్వరూపమును దెల్పుట. ప్రథమావస్థ అహంకారోదయముతో బ్రారంభించును. ఈ యహంకారావేశమును దాని సహచరులగు కామక్రోధాదిగుణముల విజృంభణమును నిగ్రహించుటకు పురుషునికి షుమారు యిరువదియొకు సంవత్సరములు పట్టునని యనుభవజ్ఞుల మతము. దీని యుపసంహారము రెండవ సాధన ప్రారంభించును. దీని పరిమితి జీవితాంతమువరకు నుండును. ఈ విద్యావస్థతులే మన బ్రహ్మచర్యాది చతురాశ్రమములును.

"మనము దుర్బలులుగా జన్మించితిమి. మనకు బలము కావలయును. మన మసహాయులుగను అజ్ఞానులుగను జన్మించితిమి. మనకు సహాయమును జ్ఞానమును కావలెను. మనకు జననకాలమందు కొరవడినట్టియు యుక్తవయసున నవసరమును నగు శక్తి సామర్థ్యముల నిచ్చునది విద్య. ఈవిద్య మనకు ప్రకృతివలన అనగా వ్యక్తులవలనగాని వస్తువుల వలనగాని కలుగును. మన యింద్రియములయొక్కయు చిత్తముయొక్కయు నాంతరంగిక వృద్ధియే ప్రకృతి యొసంగుశిక్షణ. ఈ వృద్ధిని వినియోగపరుపవలవసిన మార్గము జూపువాడు

గురువు. ఇతరుల యనుభవమునుబట్టి మనము గ్రహించువిష యములు లోకానుభవము.” (రూసో)

సాధనమార్గములు మూడువిధములు. మొదటిది జ్ఞానమార్గము, రెండవది భక్తి మార్గము, మూడవది కర్మమార్గము. ప్రతిజీవునియందును నీమూడు మార్గములకును ననువగు గుణము లుండును. కాని వివిధవ్యక్తులయం దీగుణములపాళ్లు భేదించుచుండును. ఒకానొకవ్యక్తిలో అన్నమయ మనోమయ విజ్ఞానమయ కోశములలో నేది హెచ్చుగా వికసించుట కవకాశ ముండునో గ్రహించి నద్దాని కనువగు సాధనను నిర్ణయించుటకు సర్వజ్ఞుఁ డగు గురువే యధికారి. ఇందుల కాతనికి ఆచారమును సంప్రదాయమును సహాయభూతము లగును. కాన వానికిని నిర్ణయాధికారముమాత్ర ముండదు. యోగమార్గమే నిజమగు భారతవిద్యాపద్ధతి. దాని యాదర్శము సిద్ధి.

విద్యావిధానమందు పఠనీయగ్రంథములకంటె సరియగు గురువులభించుట చాల ముఖ్యము. గురువు ప్రత్యక్షదైవము. గురువును జేరుట యనగా మన స్వభావమును (nature) జేరుటయే. ఇదే మన నిజమైనవిద్య. గురువే మన సృష్టి కర్త. కావున గురుశిక్షయు నియమమును సాధన కత్యంతావశ్యకములు.

విద్య నేర్చుకొను సాధకు లందరును నొకేరీతియు స్వభావమును గలవారు కారు. భిన్నబాలురు భిన్నవ్యక్తిత్వముల గల్గియుందురు. ఈవ్యక్తులను సాధకులుగా జేయుటకు ప్రాక్ట

రీలోవలె నొకేసమానా శిక్ష నిచ్చుట దోషము. సాధకుని వ్యక్తిత్వము ననుసరించి శిక్షను గరపవలెను. పాశ్చాత్యవిద్య వ్యక్తిత్వమును నశింపజేయును.

గురువు ముఖ్యముగా నీ క్రింది గుణవిశేషములను కలిగియుండవలెను.

(1) తన విద్యార్థులయొక్క యనంతచిత్తవృత్తులను సమగ్రముగా నెఱిఁగి తదనుసరణముగా వారి వారి కుచితమగు భిన్న భిన్న సాధనమార్గముల నేర్పరుపగలుగుట.

(2) విద్యా ఉవిద్యలను, యథార్థ పరమార్థములను తాను స్వయముగ గుర్తెఱింగి బాగుగ నిర్ణయింపగల సాధనామార్గమున సమర్థత గలిగియుండుట.

(3) తాను సిద్ధుఁడై యుండవలెను. అథమము సిద్ధత్వమునకు సామీప్యమున నైన నుండవలెను.

(4) ఇహాపరవాంఛల కతీతుఁడై యుండవలెను. అనగా నిహాపరములకై తా నితరులపై యాధారపడియుండరాదు. అప్పుడే తాను సంఘము నంతను వశము జేసికొనగలుగును. మన యోగులు, ఋషులు, సన్న్యాసులు గురుత్వమున కర్హులు. రాజుగూడ నిట్టి గురువునకు శిష్యుడైయుండును. అట్టి గుర్వాజ్ఞలను, ధర్మవ్యాఖ్యలను రాజు మీరరాదు. ఉదాహరణ: వశిష్ఠుడు. ఈకాలమున నిట్టిగురువులు లభించుట దుర్లభమని కొంద అనవచ్చును. కాని దీనికి ముఖ్యావసరమగు

సంస్కరణము, మనదృక్పథమును మార్చుకొని ప్రస్తుతవిద్యా విధానమును సంపూర్ణముగా తారుమారుచేయుటయే.

మన సంప్రదాయమున విద్య గురుకులవాసముతో సంపూర్తి కాదు. జీవితమంతయు యథార్థముగా మనకు విద్యాలయమే. మన సంఘకట్టుబాటు లన్నింటిలోను గురుకుల వాస మొకమెట్టు. మన సంఘమున కంతకును బ్రాహ్మణులే (అనగా నిప్పటి బ్రాహ్మణోత్తములు కారు) గురువులు. ప్రతి మానవుని జీవితమును బ్రాహ్మణులవలన కొంచెముగనో గొప్పగనో ప్రేరేపింపబడుచునే యున్నది. బ్రాహ్మణు లనగా నొకానొక సంఘమున కవసరమగు ధర్మార్థకామములను ఆ సంఘగురువులవలన నెఱింగి యాయా మార్గములలో నాసంఘమును నడుపగలవారని యర్థము. (The word Brahmana as a vocational application signifies that class of persons who advocate and administer the particular body of conduct, social, moral, artistic, etc., which has been enjoined by the Guru of the Community.)

గురువు మన సంప్రదాయమునకు మూర్తి. ఇహాపరముల కధిష్ఠాన దైవము. విద్యాలయము దాటగనే విద్య ముగిసెననుకొనుట పొరబాటు. విద్యయొక్క పరమావధి యాత్మదర్శనమే. ఇది బడి గోడలనడుమ కలుగుననుట కల్ల. కావున విద్యావిధానములో గురుస్థానము నుత్తమపీఠముగ గ్రహించుట యావశ్యకము. బ్రాహ్మణులద్వారాను, క్రైస్తవపురోహితు (Priest-craft) లద్వారాను సంఘ మంతకును జ్ఞానము

(విద్య) సంక్రమించును. ప్రస్తుత కాలమున రాజ్యచక్రమే (State) యీ యాచార్యస్థానము నాక్రమించెను. ఇక్కాలపు ప్రభువులు గురుశాసనము నంగీకరింపక ప్రజలను నిరంకుశులై హింసింపుచున్నారు. మనకు సహజమగు (గురువులు) విద్యా బోధకులు బ్రాహ్మణులు. గురువు మంత్రద్రష్ట. బ్రాహ్మణుడు వేదార్థమును గ్రహించి (సాధనచే) మంత్రద్రష్ట యగుచు న్నాడు. ఈ కాలమున నుపాధ్యాయులు రాజానుమతమున విద్యాబోధ జేయుచున్నారు. వీరికిని మన సాంప్రదాయపు గురువులకును భేద మే మనగా ఈ నూతనోపాధ్యాయులు (1) జీతమును పుచ్చుకొందురు; (2) జీవితకాలమంతయు గురుబాధ్య తను వహింపరు; (3) బడి విడిచిన పిమ్మట విద్యార్థులతో వీరి కెట్టి సంబంధము నుండదు; (4) తాము చేయు పనిలో నైనను వీరి కెట్టి స్వాతంత్ర్యమును నుండదు.

మన పద్ధతిలో ప్రతివానికిని నేదో యొక విధముగా విద్యాగంధ మబ్బుటకు సావకాశ మున్నది. ఇతరపద్ధతులం దట్టి సావకాశము లంతగా లేవు. అనగా మన పద్ధతిలో లోపములు లేవని కాదు. మానవమాత్రులచే నిర్మింపబడు విధానము లన్నియు లోపభూయిష్ఠములు గనే యుండును. కాని యట్టి లోపములను చాలవరకు తగ్గించుటయు ప్రజను ఆధ్యా త్మికమనస్కుల జేయుటయు విద్యాపద్ధతులందు వర్తకసరళి లేకుండుటయు మన మార్గముయొక్క వైలక్షణ్యమై యున్నది.

మన దేశములో ప్రస్తుత పరిస్థితులలో మన సంప్ర దాయములను పునరుద్ధరించుటకు మన దృక్పథ మొకింత

మార్చుకొనవలసియుండును. ఇందు ముఖ్యముగా రాజు గురుత్వము వహించుట మానవలెను. (అతడు) వేదధర్మమును శిరసావహించవలెను. ఇది మన సమాజపద్ధతి గాన సట్టుల మార్పుల కష్టసాధ్యము కానేరదు. వేదజ్ఞులగు గురువులు మనకు కావలయునంతమంది యిప్పుడు లభ్య మగుట దుర్ఘటమే. అయినను జాతియొక్క శిక్షావిధాన మంతయు నాకొలది మంది వేదజ్ఞులకే వదలివేయుట యత్యావశ్యకము. ఇట్టి గురువులే జనసామాన్యమునకు కావలసిన ఉపాధ్యాయులను, ఆచార్యులను నియమింతురు. మన విద్యావిధానమున కంతకును వేదజ్ఞులగు గురువులే సూత్రకారులై యుండవలెను.

మన దేశమందలి బ్రాహ్మణులే యిట్టి యుపాధ్యాయ తరగతికి జెందినవారు. ఈ దేశములో బ్రాహ్మణు లెప్పుడును గౌరవస్థానమును బొందుచుండెడివారు. రాజశాసనమునకు గూడ స్వాతంత్రులైయుండిరి. అనగా వారియిచ్చవచ్చిన రీతిని వారు దుండగములను జేయువచ్చునని కాదు. దీనియర్థ మేమనగా వేదాధికారము గలిగి ప్రభువులనుగూడ తమయాజ్ఞలచే నడిపింపగల సమర్థులగుటకును ధర్మ మొసంగుటకును సర్వులగుటచే వీరు సామాన్య రాజదండనమున కతీతులుగ నుండవలె నని.

పాశ్చాత్య దేశములలోని పురోహిత (Priest-craft) కులమునకును మన బ్రాహ్మణులకును నొక ముఖ్యమగు తారతమ్యము కలదు. కొలది శతాబ్దముల వరకును వారిలో మతాధికారమును రాజ్యాధికారమును పీఠాధిపతులకే (Popes)

యుండెడిది. మన దేశములో పూర్వకాలమందు పరశు రాముడుదక్క మిగిలిన బ్రాహ్మణులలో నీ రెండధికారము లును చెలాయించుట యరిది. ఇంతియ గాక మనలో రాజు ధర్మమునకు బద్ధుడును పరిపాలకుడు నగుట సామాన్యము. గురువ్రజ్ఞలంబట్టి రాజు రాజ్యచక్రమును నడుపవలెను. దీని వలననే క్రైస్తవ క్లర్జీ లంతరించినవిధమున మన బ్రాహ్మణ్య మింకను నంతరింపలేదు.

క్రైస్తవ విద్యాసంస్థ లిట్లు క్షీణించుటకు కొన్ని హేతువుల నిట సూచింతము. (1) క్రైస్తవపీఠములకు పీఠాధిపతులు గురువుల చిత్తానుసారమెన్నుకొనబడిరి. కాని "గుణకర్మ విభాగశః" అను సూత్రమే మన సంఘమునకు జీవము. (2) అచ్చట పీఠాధిపతి సర్వాధిపతి యగుటయు, ధనార్జన మున్నగు లౌకికవ్యవహారములందు నిమగ్నుడై యుండుటయు తటస్థించెను. మన పద్ధతిలో గురుదక్షిణ కేవల మైచ్ఛికము. (3) క్రైస్తవపీఠాధిపతుల మైహికభోగే చ్ఛలు అన్యుల యీర్ష్యలకును వారి పతనమునకును గారణము లయ్యెను. (4) అన్యమతములనుండి తమ మతములో కలుపు కొనుటయు మరి కొన్ని సిద్ధాంతములును వారిమతక్షయము నకుప్రబలకారణము లయ్యెను. (Leaders and Landmarks of European History, II & III)

వారి లోటుపాట్లెట్టివైనను నీ బ్రాహ్మణులును పాశ్చాత్య క్లర్జీలును ప్రస్తుత ప్రభుత్వ పాఠశాలోపా ధ్యాయులకంటె నెక్కుడుగా విద్యాసేవ జేయగల్గిరి. ఇందుల

కనేక కారణములు కలవు. (1) వారి జీవితాదర్శమే విద్య గఱపుట. (2) అందలి విద్య యార్థికవిషయము కాకుండుట. (3) రాజ్యపాలకు లీకులమును పోషించు బాధ్యతను వహించినను విద్యావిధానమునందుమాత్రము వారు జోక్యము కలుగ జేసికొనకుండుట. (4) అందలి గురువుల జీవితాదర్శము లుత్కృష్టము లగుటచే వారి ధర్మనిర్వహణమం దెట్టి లోటును లేకుండుట. (5) వారి విద్యాపద్ధతి వ్యక్తిమార్గము ననుసరించి యుండుట - అనగా ప్రతి సాధకునియొక్కయు స్వభావ స్వధర్మములను గురువులుగు ర్తెరుగుటకు సావకాశము లుండెను. (6) ఆ గురువులకును విద్యార్థులకును యావజ్జీవసంబంధముండుట. శిష్యులు బడిలో నున్నంతకాలమే వారు గురువులు కారు. యావజ్జీవమును వారు మతగురువులును, కష్టసుఖము లందు శరణ్యులు నగుట. (7) వా రన్నివిషయములందును రాజులచే బద్ధులుగాక సంపూర్ణస్వాతంత్ర్యము వహించుట:— ఈ యన్ని కారణములచేతను ప్రస్తుత ప్రభుత్వవిద్యాలయములకంటె పూర్వకాలపు బ్రాహ్మణ క్షైస్తవ విద్యా విధానములే యుత్కృష్టములై పూజ్యములై యుండెడివి.

## విద్యార్థి స్వరూపము.

చిత్తవృత్తిని నిరోధించు టనగా యోగ మభ్యసించుట. సంప్రదాయపద్ధతులందు మిక్కిలి యుత్కృష్టమైనసాధనమార్గము యోగముగా బరిగణింపబడుచున్నది. అట్టి యోగ మాంతరంగికము, బాహ్యమునని ద్వివిధము. బాహ్యము యమనియమ

ఆసన ప్రాణాయామ ప్రత్యాహారము లని అయిదువిధములు. అంతరంగికములు ధ్యాన ధారణ సమాధులు. ఈ యెని మిదియును గర్మాచరణకు పద్ధతులుగ నెంచవలయును.

ఇవి నాలుగాశ్రమములకు వర్తించును. వీనికి నిర్వచన మిట్లు చెప్పబడినది.

(1)...అహింసా సత్యాఽస్తేయ బ్రహ్మచర్యా పరిగ్రహా యమాః. యోగసూ. 2.30

(2) శౌచ సంతోషతపః స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని నియమాః ,, 2.32

(3) స్థిరసుఖ మాసనమ్. ,, 2.46

(4) తస్మి న్సతి శ్వాస ప్రశ్వాసయో ర్గతివిచ్ఛేదః ప్రాణాయామః. ,, 2.49

(5) స్వవిషయా సంప్రయోగే చిత్తస్వరూపాను కార ఇవేన్ద్రియాణాం ప్రత్యాహారః. ,, 2.54

(6) దేశబన్ధ శ్చిత్తస్య ధారణా. ,, 3.1

(7) తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్. ,, 3.2

(8) తదేవార్థమాత్రనిర్భాసం స్వరూపశూన్య మివ సమాధిః. ,, 3.3

ధారణా, ధ్యాన, సమాధుల కూడికకు 'సంయమ' మని నామము.

(దీనినిగురించి మనుస్మృతి, గృహ్యసూత్రములను జూచునది.)

ఈ యెనిమిది యంగములును చతురాశ్రమములకు వర్తించును. అనగా యోగాంగములను తత్తదాశ్రమావసరముగ, ఆశ్రమవిధి చోదితముగ, తగుమార్పులతో జీవి సమర్థతావృద్ధుల ననుసరించుచు ననుష్ఠింపవలయుననుట. బ్రహ్మచర్యమునఁ గేవలము స్వసౌఖ్యనియమము; గార్హస్థ్యమందు సౌఖ్యముఁ బొందునట్టి ప్రాణులకుఁగూడ నియమమేర్పరచుకొనుట, వానప్రస్థ, సన్న్యాసములలో ప్రాణి సంగత్వమును వర్జించుట.

(విద్యార్థి స్వరూపమునకు సాంఖ్యాయన గృహ్యసూత్రములు II & III ప్రథమఖండము. అ IV, 8, 11, 12 ఖండములు; ఆశ్వలాయన అ I, 19-22; ఆపస్తంబ ధర్మ సూత్రములు 2-75; 153-161 జూచునది). ఈరీతిగ బ్రహ్మచర్యాశ్రమమందు సాధ్యమగునంతవరకు యోగాంగ రూపముగ జితేన్ద్రియత్వము నభ్యసించినచో నహంకారము సంపూర్ణముగఁ దొలఁగి కామక్రోధాదిశత్రువులు దాసులై జీవయాత్రకుఁ దగు సహాయకారులై యుండుటయు; అంతఃకరణవృత్తులన్నియు నియతరీతిని వర్తించుటయు సమకూరినప్పుడు ప్రథమాశ్రమముయొక్క ముఖ్యోద్దేశము నెరవేర్పఁబడును. ఇందువలనఁ బరిణతబుద్ధి సంప్రాప్తమగును. అవసరమగు నెడల గురువు, విద్యార్థిని కఠినముగ శిక్షించియైన నిట్టి గుణసంపదఁ గలుగఁజేయకుండినచో నా విద్యార్థిజీవిత మంతయు నపరిపక్వబుద్ధిచే, నజేయములై చెలరేగు కామక్రోధాదు

లచే క్రూరముగ దుర్గతి పాలుసేయఁబడును. కావున నహంకా రోదయమునుండి దాని స్వాధీనమువరకు నుండు జీవితకాలము (అనగా 5, 6 సంవత్సరములు మొదలు 25, 30 సంవత్సరముల వరకు) విద్యానుష్ఠానమునందు చాల శ్రద్ధ వహింపవలసిన కాలముగ గ్రహింపవలయును. అందువలననే విద్యార్థి గురువునొద్దకుఁ బంపఁబడుటయు, ఆగురువున కతనిపై సంపూర్ణాధికార మొసఁగబడుటయు, ఆకాలమునందు ముఖ్యముగఁ జిత్తశుద్ధిఁ గలుగజేయుటయే ప్రధానమైన విద్యావిధాన లక్ష్యముగ గ్రహింపఁబడుటయు నావశ్యకము లగుచున్నవి. ఈ యాశ్రమమును బ్రహ్మచర్య మందురు.

ఇట్లు జితేంద్రియుఁడైన విద్యార్థి తాను పఠించిన ధర్మముల ననుష్ఠించి, తద్ద్వారా లోకానుభవము సంపాదించి సంపూర్ణవివేకజ్ఞానమును సంపాదించుటకై ద్వితీయాశ్రమ మేర్పడినది. వివేకజ్ఞాన మన నిత్యానిత్య వస్తు వివేచన మని గ్రహింపనగు. పదార్థము లన్నింటితో సంయోగవియోగాది సంబంధానుభవము గలిగినఁ గాని పైఁ జెప్పఁబడిన జ్ఞానము లభింపదు. వస్తుజాలముతో సంబంధ బాంధవ్యము లందు నేర్పును, ధర్మాచరణమును, జితేంద్రియత్వ సిద్ధియు కామక్రోధాది భావస్వాధీనత్వమును, శమ (కామక్రోధాదులు లేకుండుట), దమ (ఓర్పుట) సాధన సంపత్తులు లభించుటకును, అనంతరము వర్తింపవలయును. ఈ చివర మూడును బ్రహ్మచర్యము. అనగా సాధనచతుష్టయమందు శమదమాది గుణలాభ మనునది బ్రహ్మచర్య మననగు. ఇట్లే సాధనచతు

ష్టయము వివిధాశ్రమములందు లభ్య మగును. సాధనచతుష్టయమన (1) నిత్యానిత్య వస్తువివేకము. (2) శమదమాది షట్కసంపత్తి. (3) ఇహాముత్ర ఫలభోగ వైరాగ్యము. (4) ముముక్షుత్వము. వివేకజ్ఞానము గృహస్థాశ్రమమునం దలవడును. ఇహాముత్రఫలభోగవైరాగ్యము వానప్రస్థాశ్రమ మందు కలుగును. అప్పుడే ముముక్షుత్వము లభించును. ముముక్షువే సన్న్యాసాశ్రమప్రవేశమున కర్హుడు. ఈ నాలుగు లాభములును విద్యానుష్ఠానమువలనఁ గలుగును. వీనిం బ్రసాదించుటయే విద్యానుష్ఠానాశయము. ప్రథమమున మూడు ఆశ్రమములలోను విద్యయొక్క ప్రథమభాగము అనగా చిత్తశుద్ధి ప్రాధాన్యము వహించును. తురీయాశ్రమమునందు నిజస్వరూప జ్ఞానబీజములు నాటఁబడును.

ఈ నాలుగింటి ననుసరించియే చతుర్విధాశ్రమము లేర్పడినవని గ్రహింపవలెను. విద్యానుష్ఠానము సాధనచతుష్టయమును సంపాదించుటయే ముఖ్యాశయము కలదిగనుకను, సాధనచతుష్టయము ననుసరించి క్రమశః నాలుగు ఆశ్రమములు విద్యావిధానమునందు ఏర్పరుపవలసివచ్చెను. ఇందు గృహస్థాశ్రమము—ఈ భాగమందు వ్యక్తి, వివేకజ్ఞానము నార్జింపవలయును. వివేక మనుభవజన్యము. అనుభవము సంయోగ వియోగాత్మకము. సంయోగ వియోగాది కర్మవిశేషములు దారపుత్రాది నిఖిల వస్త్వాశ్రయములు. ఈ పదార్థజాలమున కంతకును భార్యయే మూలకారణ మగును. కావున గృహస్థాశ్రమమందు వ్యక్తి తదితరవ్యక్తులతో సంయోగ వియోగా

దుల నభిలషింపవలయును. ధర్మార్థములకు వలయు విషయ జ్ఞానమును బ్రహ్మచర్యాశ్రమమందు సంపాదించి కామపురుషార్థమునకు వలయు విషయజ్ఞానము గృహస్థాశ్రమమందు గాంచి దానిని గృహస్థాశ్రమము మొదలు ఆచరణలోనికి దేవలయును. వానప్రస్థమున విద్యావిధానము వైరాగ్యముఁ బ్రసాదింపవలయును. గార్హస్థ్యమున, సంయోగ వియోగాది కర్మానుష్ఠానముచే లభించిన వివేకజ్ఞానమువలన వైరాగ్యోదయ మగును. ఈ భావము నీ యాశ్రమమందు సంపూర్ణముగ వృద్ధినొందించు రీతిని విద్యావిధానము నేర్పరుపవలయును. ఈ యాశ్రమమునందు పదార్థజాలమునకు దూరుఁడై వ్యక్తి వర్తింపవలయును అందువలననే, వనమునం దుండుట, క్రమేణ సంసారభోగమును తగ్గించుకొనుట మొదలయిన నియమములేర్పరుపఁబడినవి. ఈ విధమున నంకురించిన వైరాగ్యమును పెంపొందించి సంపూర్ణ నిస్సంగత్వభావముచే శోభిల్లు సాధకుఁడు మోక్షమునకై వేచియుండుటఁ దక్క నితరాసక్తి గాని, యితరకర్మ గాని, లేకనే సంశయమును నాంతరంగిక యోగరీతి నభ్యసింపదగిన యాశ్రమము సన్న్యాసాశ్రమము. ఈ నాలుగు ఆశ్రమములందు ఏర్పరుపఁబడు విద్యావిధానము వ్యక్తిత్వభేద చోదితమగు సాధనమార్గములందు అనగా భక్తి జ్ఞాన కర్మయోగములందు ఆ యా వ్యక్తి కెయ్యది యనుష్ఠేయమో, అద్దానిని సంపూర్ణముగ సంయమరీతిని అభ్యసించుటకే మాత్రము ఆటంకముఁ గలుగఁ జేయ దని గ్రహింపవలయును.

ఈ చతుర్విధాశ్రమరీతి ప్రతివ్యక్తికి నవసరమా యను నంశము నొకింత విచారింపవలయును. ఆ యా వ్యక్తియొక్క జీవిత మతని ప్రారబ్ధ (Beginning), సంచిత, (to be done)), ఆగామికర్మల ననుసరించును. అనగా "బుద్ధిః కర్మానుసారిణీ" యను వాక్యమునుబట్టి ప్రతివ్యక్తికిఁ గలుగు భావపరంపరలు కర్మచోదితములుగనే గ్రహింపవలయును గనుక వానిస్థితి ననుసరించి యాశ్రమావస్థలు కలుగును. విద్యానుష్ఠానము లేకయే భావపరంపరలు వివేకగర్భితము లైనచో, నీషద్బహిర్యోగాభ్యాసముఁ గావించి బ్రహ్మచర్యగార్హస్థ్యముల సంపూర్ణముగ జరుపకమున్నే వానప్రస్థసన్న్యాసాశ్రమములు క్రమముగ స్వీకరించి, కామమోక్ష పురుషార్థసిద్ధికై సాధన సేయ నర్హుఁడగును. ప్రారబ్ధకర్మ, బ్రహ్మచర్యమం దభ్యసించు యమనియమాదులచే నిర్జింపఁబడును. సంచితాగామికర్మలు సంయమాభ్యాసముచేత నశించును. శమదమాది గుణములను సంపాదింపక పూర్వము వివేకాది జ్ఞానార్జనము దుర్లభము. జీవి విద్యానుష్ఠాన ప్రథమావస్థయందు యమనియమాది యోగమార్గావలంబనముచేత శమదమాదిషట్కసంపత్తి సంపాదింపనగు. జీవయాత్రయందీ కాలమునకే బ్రహ్మచర్యమని పేరు. ఈయది వివిధభావాంకుర కాలమునందే గుర్వనుగ్రహమున సాధ్యమగును. వ్యక్తియందు స్థాయిభావమేర్పడిన పిమ్మట, యమనియమాది యోగాభ్యాసమును, దాని ఫలితమును సాధించుట చాల కష్టము. ఈభావాంకురకాలము యౌవనము (బాల్యాత్పరమైన యౌవనము),

ఇదియె బ్రహ్మచర్యసమయము. వివేకజ్ఞానము శమదమాదులచేగాని సాధింపఁబడదు. వివేకగ్రహణానంతరమునగాని వైరాగ్య మభ్యసింప వీలుపడదు. వైరాగ్యక్షేత్రమే మోక్ష బీజములు వృద్ధినొందుటకు యోగ్యమయినది. కావుననే, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసాశ్రమములు వరుసగ నేర్పడినవి. బ్రహ్మచర్యమునకువలె వీనికిని కాలపరిమితిని నిర్ణయింప వీలులేదు. గృహస్థాశ్రమము పుత్రసంతతి కలిగినవెంటనే విడనాడవచ్చును. ఎందువలన ననఁ బుత్రాది పరిణామములతో సంపూర్ణకర్మాధికారి యగునుగాన తద్ద్వారా వివేకజ్ఞానము గలుగును. అట్టి వివేకసహాయముచే వానప్రస్థము బ్రవేశించి వైరాగ్యోపాసన కర్హుఁడగును. వానప్రస్థ సన్న్యాసములకుఁ గాలపరిమితి గుర్వనుగ్రహమును, సాధకుని సమర్థతయు నేర్పరచును.

ప్రతిపురుషుఁడును విరాగి కావలసినదేనా? యను ప్రశ్న నొకింత విచారింపవలయును. ప్రతివ్యక్తియు నిహలోకమును విడనాడవలసిన యావశ్యకము సర్వజనవిదితము. ప్రపంచమందున్నంత కాలమందేగాని, ప్రపంచమును వీడినపిదప జీవునికి సంప్రాప్తమగు స్థితిగతులయందు భోగ ముండుట యచింత్యము. మరణానంతరమునఁ బదార్థములు జీవునికిఁ గనుపింపవు. జీవుఁడే నిలిచియుండు ననునభిప్రాయము వివాదాంశము. పదార్థజాలములే భోగ్యములు. వీనితో గలయికయే భోగము. వైరాగ్యము లక్ష్యము గానిదే భోగ మైయుండవలయుఁగద. జీవునిచరిత్రఁ గాంచినచో, భోగము శాశ్వతము కానేర దని

పైజెప్పిన కారణమువలన స్పష్టమగుచున్నది. వైరాగ్యము కేవలభోగాభావమే కాదు; భోగదారిద్ర్యముల యభావము వైరాగ్యము. ఇది భోగదారిద్ర్యానుభవము తర్వాతగాని సిద్ధింపదు. వ్యక్తికి వైరాగ్య మబ్బినప్పుడు భోగదారిద్ర్యాది ద్వంద్వము లెవ్వి సంభవించినను నిశ్చలుఁడై యాత్మవిచారము నందే పరిపూర్ణతఁ జెంది యుండఁగలఁడు. అనగా ద్వంద్వమును జయించినవాఁడుగ నుండఁగలఁడు. ద్వంద్వబద్ధునికంటె ద్వంద్వజేత యుత్తముఁడుగద. అందువలన వైరాగ్యము సర్వజనానుష్ఠేయము. ఇందునుగూర్చిన సంశయము లన్నియు వైరాగ్య పదాభిప్రాయము గుర్తెఱుఁగని వారివలన సంభవించినవి. వైరాగ్య మనగా కర్మలను విడచుట కాదు. కర్మబద్ధుఁడు కాకుండుట. వైరాగ్యము జీవునకు ధర్మమందు పరిపక్వస్థితి సంపూర్ణత్వమును సూచించును. (Vairagya is not detachment; it is mere non-attachment: it is the fulfilment of one's moral nature).

---

అయిదవ అధ్యాయము.

# పురుషుఁడు—విద్యావిధానము.

## బాలశిక్ష (Elementary)

### విషయ వివరణము.

కాలపరిమితి:—మూఁడు సంవత్సరములు.

(అ) పంచాక్షరీ మంత్రోపదేశము. ఓం నమశ్శివాయేతి మంత్రముగాని బాలకుని సంప్రదాయము ననుసరించిన మంత్రమైనను ఉపదేశము చేసి విద్యాభ్యాసము ప్రారంభింపవలయును.

(ఆ) శబ్దసిద్ధి:—అయిదుబళ్ళుసంస్కృతాంధ్రములయందక్షరసంజ్ఞ దెలుపుట, గుణింతము, పదములకూర్పు, చదువుట, వ్రాయుట.

కంఠపాఠము:—సుమతి శతకము, దాశరథి శతకము, బాలరామాయణము, వేమనపద్యములు, ఆంధ్రనామసంగ్రహము, రుక్మిణీకల్యాణము, గజేంద్రమోక్షము, దండకములు, భారతభాగవతములు చదువనేర్చుట, సంధ్యావందన మంత్రములు స్వరయుక్తముగా వల్లించుట.

(ఇ) జ్యోతిషప్రథమశిక్ష:—సంవత్సరములు, నెలలు, వారములు, తిథులు, నక్షత్రములు, రాసులు, వగైరా పంచాంగములు.

బాలగణితము:—కూడిక, తీసివేత, హెచ్చువేత, భాగహారము, బజారులెక్కలు, ఎక్కములు, నోటిలెక్కలు, మానములు, అంక సంజ్ఞలు గల వివిధవిషయములు.

(ఈ) పురాణేతిహాస శ్రవణము (History):—రామాయణము, భారతము, అష్టాదశ పురాణములు, కథారూపముగా బాలకులకు జెప్పవలయును; గోష్ఠిసమయమున బాలకులచే సంతులవెంబడి నీగ్రంథముల జదివించు చుండవలయును. వీర రసప్రధానములైన కథలు, మహాపురుషుల దిగ్విజయయాత్రలు అనగా, ధర్మరాజు, అలెగ్జాండరు, సీజరు, చార్లిమేను, నెపోలియన్, నెల్సను, హిండెనుబర్గు, శివాజీ, ఖడ్గతిక్కన, హైదరాలీఖాన్ ఇత్యాది. లోకోద్ధారకులచరిత్రలును (అనగా శ్రీకృష్ణుడు, బుద్ధుడు, క్రీస్తు, మహమ్మదు, నానకు, శంకర, మధ్వ రామానుజులు, కన్ఫూషియసు, జారథిష్ట్రా ఇత్యాది.)

వర్తమాన ధర్మనిర్వాచనకారులును, స్వదేశ నాయకులును, మహాపతివ్రతల చరిత్రములు, కథారూపముగా, పౌరాణికమార్గము ననుసరించి చెప్పవలయును.

ప్రపంచవివరణము (Corresponding to Geography):—పంచభూతముల ప్రకాశరూపమును, అందుండు స్థూలభాగములను, బాలకులకు బోధింపవలయును. అనగా,

౧ భూమియందు:—పర్వతములు, లోయలు, చదరములు, మెరక వల్లములు, ద్వీపములు, ద్వీపకల్పములు, భూసంధులు, ఎడారులు, అడవులు, జనావాసములు.

౨ జలమందు:—సముద్రములు, సరస్సులు, నదులు, జలసంధులు, జలపాతములు, ఊటలు, మంచుగడ్డలు, మేఘములు ఇత్యాది.

3 వాయువునందు:—తుపానులు, సుడిగాలి, మలయమారుతము, ఉత్తరపుగాలి, వర్షము, ఆవిరి, మంచు ఇత్యాది.

౪ తేజమునందు:—సూర్యమండలము, చంద్రమండలము, అగ్నిపర్వతము, నక్షత్రమండలము, దావానలము, బడబాగ్ని, ఖద్యోతములు, మెఱపుతీగెలు, కొఱవిదయ్యములు ఇత్యాది.

౫ ఆకాశమునందు:—దిక్కులు, శబ్దవిశేషములు.

పంచభూతాత్మకమైన సమస్త స్థావర జంగమాదుల వివరమును, వీనిని బాలకులకు బోధించి నైసర్గిక స్వరూపములను చక్కగా నెఱింగింపవలయును. బాలకులు నివసించు గ్రామములయు, ప్రాంతములయు, నైసర్గిక స్వరూపమును సరసముగా నెఱింగింపవలయును.

(ఉ) ప్రమాణజ్ఞానము (Science). బాలకులయొక్క సర్వేంద్రియ వ్యాపార సౌష్ఠవ మిందు ప్రధానలక్ష్యము. బాలకు డార్జించు విషయజ్ఞానము. అర్థాత్-పశుపక్షివృక్షాది ప్రాణిసంచయముయొక్క జీవనమార్గమునందలి స్థూలాంశములను చక్కగా గుర్తెఱుగునట్లు చేయవలయును. అనుమితజ్ఞానము గురుముఖతః సిద్ధాంతము కావలయును. గోవులు పావు

రాలు, నెమళ్లు, హంసలు, పూలతోట, ఇత్యాదులను పెంచుట, ఇందులకు లక్ష్యముగా నెఱుంగునది.

(ఊ) కళాకలాపము - (Art) రూపకల్పన (fine arts). దన్తూరి, సర్వేంద్రియ గోచరములగు స్థావర జంగమాదులను మృత్తికాదులచే రూపకల్పన చేయుట - గానగోష్ఠి - కథలు కట్టుట, విప్పుట - తిరుమలేశ పద్యాలు, నృత్యము (లయాన్వితము), పదు్రిచులు తెలుపుట - అనంగాలు ఇత్యాది.

౨ వస్తుకల్పన (Industrial arts) :— బాలకుని యొక్క సమస్త కర్మేంద్రియ వ్యాపారావశ్యకములగు పనిముట్లను కల్పింపజేయుట. (అనగా, పాత్రలు, చాపలు, నేత, బొమ్మలు ఇత్యాది)

(ఋ) రామదండు (Sports):—బాలకుని స్వభావానుసరణముగ వివిధమైన ఆటపాటలు రామశబ్దముతో మేళవింపజేసి నేర్పవలయును. నాట్యము, భజన ఇత్యాది.

ఉపనయనము (Admission)

బాలశిక్ష - బాలకుని సంప్రదాయానుసరణముగ ఉపనయన కర్మ ఆచరింపజేసి తదను గుణమగు మంత్రోపదేశముం జేసి, ఆసమయముననే గురుసత్కార మొనరించి బాలకుని విద్యాశాలయందు ప్రవేశపెట్ట వలయును. బాలకునియొక్క ఈక్రింద నుదహరింపబడిన వివరములు ఉపనయనకాలమందు చక్కగా తెలిసికొనవలెను.

౧. కులగోత్రములు.

౨. కులదైవము.

3. వృత్తి.

౪. జాతకము.

౫. బాలకుని శిక్షాపరిమితినిగూర్చి తలిదండ్రుల యభిప్రాయము.

వీనిని ఒక పుస్తకమునందు వ్రాసి యుంచుకొన వచ్చును. ఉపనయనసమయమున ఈ పై వివరముల ననున రించి దీక్షారూపము నొక దానిని బాలునికి ప్రసాదింప వలెను.

బాలకుడు నిరుపేద కుటుంబమునకుఁ జెందియున్న యెడల ఉపాధ్యాయుడు తల్లిదండ్రుల యనుమతి బడసి తన గృహమునందే యుంచుకొని అన్నవస్త్రములకు తగు వసతి నేర్పరుపవలెను. అట్టి బాలకులను తన పుత్రుల మాడ్కి చూచుకొనుచు దగు పోషణ జరుపవలెను. ఉపాధ్యాయు లందునిమిత్తము తమ గృహనిర్మాణమునందు తగు వీళ్ళ నేర్పాటు చేసికొనవలెను.

ఈ క్రింది నమోనా ప్రకారము "వృత్తిదర్పణము" అను పేర నొక కులగోత్రాదికము నుదాహరించు గ్రంథమును సేకరింప వలయును.

| వరుస సంఖ్య. | ఉపనయన తిథి | కులగోత్రములు | కుల దైవము | వృత్తి | జాతకము | విద్యా పరిమితి | అధికార వివేచనసామగ్రి | అధికారి సిద్ధాంతము | షరా |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | ఇందు విద్యాశాలా ప్రవేశముహూర్తము నుదహరింపవలయును. | ప్రకృత వర్ణసితి ననుసరించి వీని నుదహరించ వలయును. స్వగ్రామమునిచ్చట నే తెలుపవలయును. | కులగౌరవములగూడనిందు వివరించునది. ఇష్టదైవనిర్ణయము ను ఇందు వివరించునెడ తల్లిదండ్రుల అభిమత మేలుంగవలయును. | వంశవృత్తియు ప్రకృతవృత్తియు నిందుండును. | ఈస్థలము విశాలముగ నుండవలయును. రాశిచక్రము అంశచక్రము స్పష్టీకరించునది. | ఇది తలిదండ్రుల యభీష్టము ననుసరించి నిర్ణయించునది. | అంతఃకరణప్రవృత్తులు నిర్ణయించుటయందు ఉపాధ్యాయుడు బాలకుని సర్వకాల సర్వావస్థలయందలి చర్యను పరీక్షించుచు నందలి యధికారనిరూపణానుకూలములగు నంశముల నిం దుదహరించవలయును. అనగా బాలకుని నోటికనువైన రుచి కంటికింపైన వర్ణము చెవి కింపైన పాట స్వభావ నియతమైన కర్మ కథాలాపమందుత్పన్నమగు రసములలో బాలకుని రంజించు రసమును మొదలగునవి వివరించునది. ఉపాధ్యాయునకు మనోనిశ్చయము కుదిరినప్పుడుగాని బాలకుడు బడివదలి వెళ్ళునప్పుడుగాని, యుదహరింపలయును. | బాలకుడు "విద్యార్థి" యగువరకును నిచ్చట తాత్కాలిక సిద్ధాంతము నే ప్రదర్శింపవలయును. బాలకుని, ఉపాధ్యాయునియొక్కయు తలిదండ్రుల యొక్కయు సమక్షమున పిఠాధిపతి ఈ సిద్ధాంతమును చేయవలయును. ఇది బాలకుడు పాఠశాలలో ప్రవేశించిన ఆరుమాసములకు మించని కాలమున నిర్ణయము జరుగవలయును. | |

బాలశిక్ష కుపనీతు డగుటకు బాలకుడు జడస్వభావ మును సంపూర్ణముగా వదలి అహంకారోదయమైన సమయ మునసే యర్హుడుగాని కేవలము వయోవిచారమే యాధార ముగా నుండకూడదు. ఇది యుపాధ్యాయులు మాత్రమే నిర్ణయింప నర్హులు.

పెద్దబాలశిక్ష :- (Secondary Education)

ఉపనయనవిధాన మిచటగూడ చిన్న బాలశిక్షకు వలెనే నూతన బాలకుల విషయములో వర్తింపనగును. ముఖ్యముగా వృత్తిదర్పణమందు 'అధికారి వివేచన సామగ్రి' 'అధికార సిద్ధాంతము' అను శీర్షికలందు వెనుకటికంటె విషయ మెక్కుడుగా స్పష్టీకరింపబడును. పెద్ద బాలశిక్షయందు ప్రత్యేకముగా వృత్తిదర్పణ ముండును.

విద్వద్భాగము :– (Collegiate Course)

నూతన విద్యార్థుల విషయమై బాలశిక్షకు వలె వృత్తి దర్పణమందు వివరములు వ్రాయవలెను. అందఱికి అధికార సిద్ధాంతము తాత్కాలికముగా గాక స్థిరముగా నేర్పరుప వలెను. విద్యార్థులనుగురించిన వివరములు వ్రాయుటయందు తల్లిదండ్రుల సలహా విశేషించి యవసరము లేదు.

అధికారి వివేచనము :— (Classification)

బాలశిక్ష:— గుణకర్మవిభాగము ననుసరించి యధి కార నిర్ణయ మొనర్పవలయును. ఇదియె బాలకుని స్వరూప స్వభావనిర్ణయము. అయిదు తరగతులు ముఖ్యముగా

నేర్పడును. సత్త్వవృత్తిప్రధానముగా గలవారును, రజో వృత్తిప్రధానముగా గలవారును, తమోవృత్తి ప్రధానముగా గలవారును, సములును, మిశ్రులును. ఇందు సములు చాల అరుదుగా నుందురు. ఈవృత్తిత్రయము సమవిభక్తమై సమాన ప్రతిభ కలిగి యెవ్వరియందు వర్తించునో వారు సములు. అట్టివా రుండుట దుర్లభము. లభించినచో దైవసమానులగుట సామాన్యశిక్షామార్గములు వారియెడల వ్యర్థములు. కావున సామాన్యముగా నాలుగు గణములు మాత్రమే యేర్పడును. సత్త్వగణము, రజోగణము, తమోగణము, మిశ్రగణము. ఈ నాలుగును నాలుగు తరగతులపేళ్ళు. గణమునకు ముప్పది మంది బాలకులును ఒక యుపాధ్యాయుడును నుందురు. ఈ వివిధవృత్తుల లక్ష్యలక్షణజ్ఞానము సంపూర్ణముగా గల్గి యే యేవృత్తియందు ప్రత్యేకముగా నభిమాన మెవ్వరికిఁ గలదో వారే యా యా గణమున కుపాధ్యాయపదవి నలంకరింప నర్హులు. మిశ్రగణమున కుపాధ్యాయపదవిని వహింప వృత్తి త్రయమునందు సమప్రతిభ కలవారే యర్హులు. ఒక్కొక గణమునందు మూడు శ్రేణులు ఏర్పడును. వర్షారంభమున నుపనీతులైన బాలకులు ప్రథమశ్రేణివారు. ద్వితీయ వర్ష శిక్షనొందువారు ద్వితీయశ్రేణివారు. ఇట్లే తృతీయశ్రేణివా రును. ఈమూడుశ్రేణులందును శ్రేణికి పదిమందివంతున ముప్పదిమంది బాలకులు ఒక యుపాధ్యాయుని క్రింద నుందురు. ఈమూడుశ్రేణులకు నుండు ఉపాధ్యాయు డొక్కడేగనుక శిక్షా విషయములకు వేర్వేరుగా నుపాధ్యాయుల నేర్పరచు ప్రస్తు

తాచారము ననుష్ఠింపదగదు. ఒక్కొక గణమునకు బాలకులు ముప్పదిమందికి మించినయెడల ఉపాధ్యాయుల నింకొకరిని నియమింపవలెను. దినచర్య "అనుష్ఠానము" నందు చూడ నగును.

బాలశిక్షకు నియమితమగు కాలము మూడుసంవత్సరముల పర్యంతమును, బోధనవిషయముల నన్నిటిని ఒక ఉపాధ్యాయుడే నిర్వహింపవలయును.

ఈ గుణవిభాగమునకు మూడంశము లాధారభూతములు.

౧ బాలకుని కులగోత్ర సంప్రదాయములు.

౨ జాతకము.

3 అనుభవము.

మొదటిరెండును బాలకుని స్వభావము నిదమిత్థ మని నిర్ధారణ చేయజాలవు కాని సూచించు ననుటమాత్రము నిజము. ఈసూచననుబట్టియే యనుభవము నడచును.

అనుభవమునకు మాత్రము సిద్ధాంతాధికార మున్నది. దీనినే వృత్తిదర్పణమందు ముఖ్యముగా వివరింపవలసియున్నది. బాలకునియొక్క దినచర్యయందు జ్ఞానేంద్రియ కర్మేంద్రియ వ్యాపారానుమితములైన బాలకుని యభిలాషయు నభిమతమును తత్స్వభావనిర్ణయమునకు మార్గదర్శకములు. సిద్ధాంతమీ మూడింటి సమన్వయముగా నుండును. గురుకులవాసము చేయు బాలకుల స్వభావము నిర్ణయించుట యుపాధ్యాయు

లకు సులభసాధ్యము. లేనియెడల తలిదండ్రుల సహాయ మపే క్షింపవలయును. స్వభావ పరిజ్ఞానమునకై యవసరమగు పట్లు తగు సందర్భముల గల్పించి బాలకుని చిత్తవృత్తి సాంగో పాంగముగా దెలిసికొనవలయును. ఈ స్వభావనిర్ణయ ముపనీతు డైన యారుమాసములకు మించనికాలమున జరుగవలయును. అంతవరకు, కులగోత్రసంప్రదాయజాతకాదులసూచన లాధా రము చేసికొని శిక్షాక్రమమును నిర్వర్తింపవలయును.

పెద్దబాలశిక్ష:—

ఇందు గణములు నాలుగే యైనను శ్రేణులు ఒక్కొక్క గణమునకు శిక్షాకాలము నాలుగు సంవత్సరములు గాన నాలుగేసి యుండును. కావున గణముయొక్క నియమిత సంఖ్య నలుబది. ఇతరవిషయములందు బాలశిక్షకు వలెనే యధికారవివేచనమార్గ మన్వయించును.

విద్వద్భాగము:—

విద్యార్థికి ఉపనయనకాలమందే స్వభావము సిద్ధాంత మగును. అదియునుంగాక విద్యార్థియొక్క శిక్షాక్రమము బాలశిక్ష, పెద్దబాలశిక్షలయొక్క శిక్షాపద్ధతికి భిన్న మగుట చేత గణవిభాగము, శ్రేణివిభాగము నిందు వర్తింపవు. విద్వ ద్భాగమున శిక్షావిషయముల నొక్కొకదానికి నొక్కొక యాశ్రమ మేర్పడుటయు తదాశ్రమాధిపతులు సర్వస్వభావ ప్రభుత్వము గలవా రగుటయు, అధికారవివేచనము సులభ సాధ్యము.

ఈ గణవిభాగము ప్రస్తుతము ఆచారమునం దున్న శిక్షాక్రమమునకు భిన్న మగుటయు, ప్రస్తుత మూపాధ్యాయ పదవులం దున్నవారల కీ పద్ధతి యొకింత యర్వాచీనముగను, విలక్షణముగ నుండుటయు బట్టి గణములయొక్క లక్ష్య లక్షణసంబంధము స్థాలీపులాక న్యాయముగ దృష్టాంతపుర స్సరముగ నిట క్లుప్తముగ వర్ణింపబడుచున్నది.

సత్త్వగణము:—

శృంగార, కరుణా, శాంత రసనిష్ఠులగువా రిందు చేర్పబడుదురు. అనగా 'విద్యాబోధకులు' 'మతబోధకులు' న్యాయస్థానమునందు పనిచేయువారును, మంత్రులు, అమాత్యులు, వైద్యులు, వేదశాస్త్రములందు శ్రవణమననాదులు గల వారియొక్క భావపరంపర శాంతరసపోషకములగు వ్యాపారములందే సంచరించుచుండును. కావున బోధనవిషయములు వారి కనువగునట్లు కూర్పవలయును.

ఇందు జేర్పబడు బాలకుల ప్రవృత్తు లెవ్వియన:—
ఆహారము: కారము తక్కువ గల పదార్థములు, మితభోజనము, చిఱుతిండియందు విముఖత, కందమూల ఫలాదుల యందు ప్రీతి, నిషిద్ధవస్తువులయందు (ఉల్లిపాయ వగైరా) విముఖత.

వ్యవహారము :— వినయవిధేయతలు అశిక్షితముగనే వెలువడుట. డంబము లేకుండుట. వేషభాషలందు శిష్టమార్గమం దాదరణమును, అవాచాలత్వము, త్యాగశీలత మొదలగునవి.

నిద్ర :— మితముగా నిద్రించుట, సకాలమునకు మేల్కాంచుట, పగలు నిద్రింపకుండుట మొదలగునవి అభిలషితముగా వెలువడుట.

వీని ననుసరించి బాలకు నేగణమందు జేర్పవలయునో యెఱుంగునది.

ఉపాసన - ఇష్టదేవతలు :— గౌరీశంకరులు, లక్ష్మీనారాయణులు, సీతారాములు, సరస్వతి, ఇత్యాది ప్రసన్నరూపములు.

రజోగణము :—

శృంగార, వీర, కరుణ, హాస్య, రౌద్ర, రసపోషకములగు వ్యాపారములయందు ఆదరణ గలవారి నీగణమందు జేర్పవలయును. క్షాత్త్రకర్మ, పరిపాలనాపేక్ష, సంగీత సాహిత్య నాట్యాది కళాకలాపము, వినోదక్రీడలయందత్యంతాభిరుచి, రూపకల్పనయందు, అనగా సంగీత, సాహిత్య, చిత్రలేఖన, శిలా దారు తక్షణ, శిల్ప నాట్యాది మార్గములయందు సంచరించువా రిందుండ నర్హులు. బోధనా పద్ధతులలో ఏతద్రసప్రధానవిషయములు నేర్పవలయును.

ఇందు జేర్పబడు బాలకుల చిత్తవృత్తు లెవ్వియన :—

ఆహారము :— షడ్రసోపేతమయిన భోజనము, చిఱుతిండియందు కాంక్ష, భోజనవస్తువులయందు విశేషమగు శ్రద్ధ, మద్య మాంసాదులయందు కోర్కి మొదలగునవి.

వ్యవహారము :— వినయ విధేయతలు శిక్షితముగా నలవడుట. డంబము గలిగియుండుట, దర్పము చూపుట, వేష భాషలందు నూతనప్రియత్వము, వాచాలత్వము కలిగియుం డుట, ఆటపాటలయం దెక్కువశ్రద్ధ, కథలు, ప్రతిజ్ఞలు, మెం డుగా నాదరించుట, ధైర్యోత్సాహసాహసము లమితముగా కలిగియుండుట, దాన ధర్మములయందు తెగువ, ఆర్తత్రాణ పరాయణత్వము.

నిద్ర :— నియమరహితమైన నిద్ర, భోగాపేక్ష.

ఉపాసన :— కోదండరాములు, నటరాజు, కృష్ణుడు, ఇత్యాది లీలారూపములు.

తమోగణము :—

శృంగార, హాస్య, రౌద్ర, బీభత్స, భయానక రస పోషకములగు వ్యాపారములయం దాదరణగల వారి నీగ ణమందు జేర్పవలయును. ఇందు శస్త్రకర్మ, వ్యవసా యము, వణిగ్వృత్తి, పాశుపాల్యము, వస్తుకల్పన, అనగా స్వర్ణకారవృత్తి, వడ్రంగము, నేత, పాత్రనిర్మాణ వృత్తి మొదలయిన మార్గములందు సంచరించువా రిందుండ నర్హులు. బోధనాపద్ధతులలో ఏతద్రసప్రధానములగు విష యములు నేర్పవలయును. ఇందు జేర్పబడు బాలకులచిత్త వృత్తు లెవ్వియన.

ఆహారము:—మద్యపాన మాంసాదిభోజనము.

వ్యవహారము:—కృపణత్వము, వైరము, వేషభాషల యందు సాధారణపరాధీనత మొదలగునవి.

నిద్ర:—భోగాపేక్ష లేకుండుట, మితనిద్ర.

ఉపాసన:—కాళి, నరసింహ, మహిషాసుర మర్దని ఇత్యాది బీభత్సరూపములు.

మిశ్రగణము:—

రసాభాసవ్యాపారములయం దాదరణగలవా రిందు జేర్పబడవలయును. వీరు ప్రస్తుత మిట్లున్నను, సాధనచే నితరగణములయందు జేర నర్హు లగుదురు. సత్త్వరజస్తమోగుణములయం దేదైన ప్రాధాన్యము వస్తుతః కలవారు గణాంతరములలోనికి మార్పు జేయబడనేరరు. గుణప్రాధాన్యము వస్తుతః కనబడక గుణమాంద్యము గలవారు సాధనచే గుణప్రాధాన్యము పొందగలరు. భటవృత్తి, గొండ్ల కుమ్మరివృత్తులు, అంబషవృత్తి, రజకవృత్తి చర్మకారవృత్తి, మొదలగు వృత్తులయం దుండువారు మిశ్రగణమునకు జెందుదురు. బోధనావిషయములందు రసపిపాసకులనుగ జేయునవి వీరికి నేర్పవలయును. ఇందు జేర్పబడు బాలురచిత్తప్రవృత్తు లెవ్వియన:

ఉపాసన:—క్షుద్రదేవతలు, పాము, తేలుమంత్రములు వగైరా.

ఆహారము:—మద్యపాన మాంసాదిభోజనము, అమితత్వము, నిషిద్ధవస్తువులందు విధినిషేధములు లేకుండుట మొదలగునవి.

వ్యవహారము:—దైన్యము, అతిసాహసము, భయము, క్రూరస్వభావము, స్వార్థపరత్వము, మొదలగునవి.

నిద్ర:—అతినిద్ర, భోగరాహిత్యము.

ఈ సత్త్వరజస్తమోగుణములలో ఉత్తమ మధ్యమాధమాదివివక్ష తప్ప, నిరర్థకముగూడ నగును. అట్లు భావించుటవలన, గీతావాక్యానుసారమైన స్వధర్మానుష్ఠానమునకు భంగము వాటిల్లును. వృత్తిభేదము మార్గభేదనిరూపణ గావించునదిగాని వేరొండు కాదు.

ప్రతివ్యక్తియందును మూడుగుణములును నుండును. అందెద్దియొ యొకటి ప్రాధాన్యము వహించును. అదియే జీవితమార్గముయొక్క వైలక్షణ్యమును సూచించును. సత్త్వగుణ ప్రధానులకు జ్ఞానమార్గమును, రజోగుణ ప్రధానులకు భక్తిమార్గమును, తమోగుణ ప్రధానులకు కర్మమార్గమును అనుష్ఠేయములు.



## ఆఱవ అధ్యాయము.

# స్త్రీ - స్వభావ వివరణము.

ఇక స్త్రీపురుషుల కుభయులకు విద్యాధికారముగలదా? ఉన్నచో పురుషార్థసిద్ధి ఉభయులకు నన్వయించునా?

పురుషార్థసిద్ధికి ద్విజన్మావస్థ యావసరము. ద్విజన్మావస్థ యనగా సంపూర్ణవ్యక్తిత్వము సంభవించుట. కాలానుసారముగా సంపూర్ణవ్యక్తిత్వము తటస్థించినపుడు, గుణోపదిష్టమై నిజగుణ కర్మ వ్యాపారము సిద్ధాంతీకరింపబడి తదనుసారముగా పురుషార్థసిద్ధికై, ఆశ్రమావస్థా గర్భితమగు అధ్యయనసంపద చేకూర్చుకొనవలయును. అనగా ప్రకృతిరూపము కల్పితరూపపరిణామమును బొందినపుడే, పురుషార్థసాధనాధికారము లభించును. పురుషుడు, వెనుకటి యుదాహరణముల ననుసరించి, భార్యను స్వీకరించి పుత్త్రాది పరిణామము నొందినపుడే, సార్థకపురుషు డగుచున్నాడు. స్త్రీ, భార్యారూపమైన కల్పితరూపమును పొందినపుడే, సంయోగ వియోగము లను ద్వివిధాత్మకమైన కర్మ కుపయోగ్యురా లగును. భార్యాత్వము స్వీకరించనపుడు, స్త్రీకి వియోగకర్మయే. పురుషునికి ఎల్లప్పుడు సంయోగవియోగాదులయందు స్వేచ్ఛ గలదు. ఏలనన భోక్తకు భోజ్యావస్థలయందు స్వేచ్ఛగలదు. స్త్రీయన్న, ప్రకృతిస్వరూపిణి గనుకను, విస్మృతావస్థ సర్వదా

పొందునది గనుకను, ప్రపంచముయొక్క శాశ్వతత్వమునందే లక్ష్యమును గలిగియుండును గనుకను, అనగా లయమందుగాక సృష్టిస్థితులయందే సహజముగా కృతనిశ్చయురాలు గనుకను నిర్గుణోపాసన కిందువలన యోగ్యురాలు కాదుగనుకను, అందు చేతనే సహజముగ జ్ఞానాన్వేషణయందాసక్తి లేక సృష్టియందే జీవితాశయము నేర్పరచుకొనుటచేతను, పురుషార్థసాధనకై కర్తృత్వము వహించు పురుషత్వమునందిమిడియుండుటచే తను, స్త్రీకి ఈసాధనయందు ప్రధానాధికారము లేదు. స్త్రీకి పురుషార్థసిద్ధికి యోగ్యమైన రూపము కల్పితరూపమైన భార్యారూపము.

శ్లో॥ ఆదౌ సిద్ధౌషధి రివ హితా కేళికాలే వయస్యా
పత్నీ తే్రతాయజనసమయే క్షత్రియాణ్యేవ యుద్ధే
శిష్యా దేవద్విజపితృసమారాధనే బంధురార్తా
సీతా సా మే శిశిరితమహాకాననే కానజాతా॥

చమ్పూరామాయణమ్, అరణ్యకాణ్డమ్.

శ్లో॥ కార్యేషు దాసీ కరణేషు మన్త్రీ
రూపేచ లక్ష్మీః క్షమయా ధరిత్రీ
భోజ్యేషు మాతా శయనేషు వేశ్యా
షట్కర్మనారీ కులధర్మపత్నీ॥

నీతిశాస్త్రమ్.

“స్త్రీత్వము పురుషుని ప్రణయారోపణచేతనే సిద్ధ మగు. కవులు, గాయకులు, ఇత్యాదులనుక్షణమును స్త్రీకి

తమ హృదయనిధులనుండి నవరసాంబరములను బ్రసాదించు చున్నారు. స్త్రీయొక్క యౌవనము పురుషుల ప్రణయజ్యోతిని దీపింపజేయుచున్నది. కల్పితరూపము చేకూరినగాని స్త్రీకి సంపూర్ణాధికారము సమకూడదు."

*　*　*　*　*

"అవిద్యాగర్భాంతరాళమును భేదించుటకై కేవల జ్ఞానాన్వేషణారూప మగు నసిధారల వర్షించుటకు స్త్రీకి నపేక్ష లేదు."

*　*　*　*　*

"స్త్రీ యోగ్యాయోగ్యతలను బట్టి పోషణ జరుపుచు పరిమితత్వము నొసంగును."

*　*　*　*　*

"పురుషుడు కూటస్థలాలసుఁడు. ప్రాణమును కాపాడుట స్త్రీ స్వభావము గాన పురుషునకు స్త్రీయందు ప్రీతి."

*　*　*　*　*

"సంసారార్థమైన ప్రీతివ్యవహారమున స్త్రీకి సంబంధము కలదు. ద్రవ్యవృద్ధి, ప్రజావృద్ధి, ఆనందవృద్ధి, ధర్మార్థ కామ పురుషార్థవృద్ధి - వీనియందే స్త్రీకి ముక్తి కలదు. కేవల జ్ఞానాన్వేషణమునకు స్త్రీకి నధికారము లేదు."

స్త్రీజన్మము ప్రకృతి పోషణార్థము జరుగుచున్నది. అనగా, స్త్రీ జన్మ మందినపుడు, తనకు నిజమైన స్థితి కలుగు చున్నది. ద్వంద్వావస్థయే స్త్రీకిఁ బ్రధానము. ద్వంద్వాతీ

తావస్థయందు లింగభేదము నశించును. పురుషునికి మాత్రము పురుషత్వమునందు ద్వంద్వాతీతావస్థ నొందుటకై సాధనం గావించుటకు అధికారము గలదు. ఈ సందర్భమున జ్ఞానయోగమే సాధనరూపముగ గమనింపవలయును. స్త్రీకి భక్తి యోగమువలన ద్వంద్వాతీతావస్థ ప్రాప్తించును. అట్టి ప్రాప్తి స్వరూపముమాత్రము అప్రాకృతికముగా నుండదు. అనగా, సమాధి, నిర్వాణము - ఇత్యాది రూపములుగా నుండదు. వ్యక్తి స్వరూపము ననుసరించియె, ఆవ్యక్తియొక్క అంతఃకరణవృత్తి భేదవిశేషముల ననుసరించియె, సాధనవిధాన మేర్పడ వలయు గనుకను, స్వానుభవము, సహజధర్మము, కర్మాచరణ మును నడుపునవి గనుకను, సాధన కేవల కర్మరూపమే కను కను, స్త్రీవ్యక్తియొక్క నిజస్వరూప నిజధర్మ నిజానుభవములు గుర్తెఱుంగకయె సాధనార్థమగు విద్యావిధానము నేర్పరచి నచో ప్రస్తుతకాలమున బ్రిజలందఱు ననుభవించు ధర్మేతర మగు ప్రవృత్తు లుద్భవించుటకుఁ గారణ మగుచున్నది.

1. ప్రపంచాభివృద్ధియే చిత్తవృత్తియందు లక్ష్యము గా నుంచుకొనుట - అనగా అనంతములుగా వ్యక్త్యుత్పత్తిని సర్వదా కాంక్షించుట.

2. వియోగమందు విముఖత్వమును, సంయోగమం దత్యంతాపేక్షయు గలిగియుండుట.

3. ఇంద్రియానుభూతియే ముఖ్యమగు ప్రమాణ ముగా గ్రహించుట. (She won't accept intuitional evidence.)

4. సమస్తభూతములును తన కార్యసాధన నిమిత్త మేర్పడినట్లుగను, తనకు, తనను గూర్చి గాక, స్వత్వసంబంధమైన జీవితాశయములు లేనట్లుగను భావించుట. (అనగా సర్వభూతముల స్వత్వమును తన సాధనసామగ్రిగనే భావించును. (Her stand-point is absolutely that of her own self-interest. She is incapable of appreciating a different stand-point. Sh edenies existence to everything that does not possess any relationship with her.)

5. సర్వభూతములును తన పరికరములుగా గ్రహింపజూచును గనుకను, తనయిచ్ఛానుసారముగ భూతములు వర్తింపవేమో యనుకొను భీతిచేతనుకూరాలు గనుకను, చతుర్విధోపాయములందు సామదానములే సర్వోపకరణసాధనము లని యభిప్రాయము కలదై, సర్వదా ప్రాణులయెడల కార్యసాధనకై అబలత్వ దైన్యభావములనే వహించి వర్తించును.

అనేకమంది స్త్రీలు వ్యవహారాంతరమందు పౌరుషమును వహించుట సామాన్యమే. ఇందులకు గారణ మనేక విద్వాంసు లనేకరీతులుగ జెప్పుచున్నారు. ఇందునుగూర్చిన సిద్ధాంతములు ముఖ్యముగ నీరీతిగఁ గనంబడుచున్నవి.

1. ఇట్టిస్త్రీలు స్త్రీశరీరము వహించినను పురుషభావముతోడనే జన్మించిరనియు, అంగలక్షణమునకు, స్వభావమునకు సంబంధ మున్నను, ఆవ్యక్తియొక్క లింగము స్వభావమునుబట్టి సిద్ధాంతీకరింపవలయునుగాని, అంగలక్షణములనుబట్టి నిరూపణ జేయరాదనియును దీనినిబట్టి ప్రతివ్యక్తియు

సంపూర్ణపురుషత్వముగాని, సంపూర్ణస్త్రీత్వముగాని వహించి యుండుట అరిది యనియు, సామాన్యముగ ప్రతివ్యక్తి యందును కొంతభాగము పురుషత్వము, కొంతభాగము స్త్రీత్వమును కలిసియుండుననియును; దీనిని గ్రహించుటకు ఆయావ్యక్తుల యంతఃకరణవృత్తులు మార్గదర్శకము లనియు; పురుషత్వము విశేషముగా గలిగి, స్త్రీత్వము అల్పముగా గలిగియున్న వ్యక్తులు అంగలక్షణమందు స్త్రీత్వమునే కన బఱచినప్పటికిని స్వభావమున బురుషత్వప్రాధాన్యమే కలదు గనుక పౌరుషేయకార్యములం దాసక్తిఁగలిగియుందు రనియు; ఇందులకు దార్ష్టాంతముగఁ దిర్యగాదివ్యక్తులయొక్క జీవిత చరిత్ర, (especially Hermaphroditism ద్విలింగత్వము) అర్ధనారీశ్వరుడు దృష్టాంతముగ నిత్తురు. దీని ననుసరించి నిజమైన స్త్రీయే కార్యసాధన కబలాత్వము వహించును.

2. పౌరుషవృత్తి నవలంబించు స్త్రీ లట్లు వర్తించుటకు గారణము, తమకు యోగ్యమైన పురుషుని సాంగత్యము లేకపోవుటయు, బాల్యమునుండి వ్రతాదినియమములచే శిక్ష నొంది తన విధ్యుక్తధర్మములను నెరవేర్చుటకుఁ దగిన శ్రద్ధాభక్తుల నలవరచుకొనకపోవుటయు నిందులకు గారణము. తలిదండ్రుల యుపేక్ష గాని అజ్ఞానము గాని అన్యమతావలంబనము గాని కారణము లనియును స్త్రీయొక్క స్వభావము గ్రహించి, తగిన వరు నన్వేషించి వివాహముఁ గావించుటయందు బాధ్యత తల్లిదండ్రులకు, గురువులకు వర్తించుననియును, అట్లు యథావిధిగ స్త్రీయొక్క జీవితవిధాన

మేర్పరుపఁబడినచో పౌరుషేయము లగు కార్యములయెడల బీతి యెంతమాత్రమును కలుగదనియును.

3. కార్యములందు పౌరుషేయములు అపౌరుషేయము లను భేదము లేదనియును, సర్వవ్యక్తులు సర్వకార్యాచరణ కధికారముఁ గలిగియున్నవనియును, ప్రపంచమునఁ బ్రస్తుతము గన్పడుచున్న యధికారభేదము తాత్కాలికమును, పురుషాహంకారజన్యమును, అస్వాభావికము ననియును, ద్విజస్వభావములో స్త్రీపురుషుల కేమాత్రమును భేదము లేదనియును, సవ్యశిక్షాక్రమము నేర్పరచినచో స్త్రీపురుషుల కుభయులకు అధికారసమత్వ మేర్పడుననియును అంగలక్షణమం దున్న భేదములు ఆగంతుకము లనియును జెప్పెదరు. కనుక పౌరుషేయములగు కార్యముల నాచరించుట స్త్రీకి అస్వాభావికము గాదనియును, అబలాత్వము దుర్విద్యాజన్య మనియును జెప్పెదరు.

ఇందు మొదటిదియు మూడవదియును పాశ్చాత్యానుభవము ననుసరించినవి. రెండవది మనధర్మము ననుసరించినది. ఈసిద్ధాంతములను విచారించిచూడ, మన కగపడుచున్న ముఖ్యాంశ మేమన, అనాదిసిద్ధముగ స్త్రీ స్వభావము అబలాత్వము వహించినట్లు కనబడుచున్నది. కాని పాశ్చాత్యానుభవమునందు ఇటీవల సర్వస్వాతంత్ర్యము స్త్రీకొసంగబడినది. అనగా పౌరుషకార్యములయందు గూడ స్త్రీకి అధికారము సిద్ధాంతీకరింపఁబడినది. అందువలనఁ గలిగిన యధర్మవృత్తు లనేకములు మనము చూచుచున్నాము. రవీం

దు్రిని వ్యాసమునందును, ఇంక ననేక పాశ్చాత్యపండితుల గ్రంథములందును (Bertrand Russel's "Social Reconstruction"; Bernard Shaw's Dramas; Schopenhaueur; Nietzche, Goethe) ఈ స్వాతంత్ర్యమువలనఁ గలిగిన దుర్నిమిత్తములు విపులముగఁ జర్చింపఁబడినవి. ఈ చర్చల వలనఁ దేలిన సారాంశ మేమన, స్త్రీయొక్క నిజస్వరూపము చక్కగా గ్రహింపఁబడక, యేర్పరుపఁబడిన విధినిషేధముల వలన నిట్టి దురాగతములు సంభవించినవి.

స్త్రీ నిజస్వరూపము నెఱుఁగుటకు మార్గములు అన్ని విషయములకు వలె మూడై యున్నవి. 1. ప్రత్యక్షాను మానానుభవము. 2. శ్రుత్యనుభవము, ఆత్మానుభవము, అపరోక్షానుభూతి. 3. సదాచారము మహాపురుషుల యాచారము. వీని ననుసరించి విచారించినచో, పైనుదహరింపఁబడిన స్త్రీస్వభావములు తేలుచున్నవి. ఇందు మొదటిమార్గము నవలంబించినపుడు, స్త్రీయొక్క యవస్థాభేదములు గోచరమై, అందు ప్రాపంచికాశయములందు లక్ష్య మెక్కుడుగా గన్పట్టుచున్నది. ఇది సర్వజనవిదితమే. పురుషవ్యక్తులలోఁగూడ అరిషడ్వర్గపీడితులై అంధకారనిమగ్నులై, కేవల మైహిక మందే యిచ్ఛ గలవారలును, నిశ్చలబుద్ధితో, నిస్సంగత్వ దీక్షతో, ప్రకృతిరహస్యములను విచారింప సమర్థత లేని వారును, స్త్రీబుద్ధియొక్క ప్రాపంచిక స్వభావము నంతగ గుర్తింపలేకపోవుదురు. అట్టివారి ప్రత్యక్షానుభవ మంతగఁ బాటింపఁదగినది కాదు. నిస్సంగత్వదీక్ష గలిగి, సాక్షిభూతులై,

ప్రకృతిరహస్యవిమర్శనముఁ గావించు మహాయోగీశ్వరుల ప్రత్యక్షానుభావమే మనకు లక్ష్యము. అట్టి యనుభవము నేకగ్రీవముగా మహావిద్వాంసు లందఱు చాటించుచునే యున్నారు.

విద్వాంసులలో రెండుతెగలవారు కలరు. 1. యథార్థ విద్వాంసులు 2. బూటకపువిద్వాంసులు. బూటకపువిద్వాంసు లనగా ననేకగ్రంథముల బఠించి, గ్రంథార్థములను గ్రహింపక, పఠనకు లక్ష్యములేక, లక్ష్యరహితమైన విమర్శయే ముఖ్యాదర్శముగాఁ గల్గి, జ్ఞానము నంతయు వణిగ్వృత్తితో సంపాదించి విక్రయముఁ జేయువారు. ఇట్టి విద్వాంసునకు అవస్థాంతరమున లక్ష్యజ్యోత్స్నలు క్వచిత్తుగా దీపింపవచ్చును. నియతజీవి కాకుండుటచే నట్టి వెలుంగు విచిత్రమును విస్మయమును కించిదాహ్లాదమును కలిగించునేగాని, యంధకారావృతమగు తనమనోగోళమును సర్వదా దీపింపనేరదు. బూటకపు విద్వాంసునకు విచిత్రభావమే యన్వేషణకుఁ బ్రేరణాంశము. (They are impelled not by their mental and constitutional necessity but by an insatiable curiosity) విచిత్రభావము నిగనిగవంటిది. ఇట్టిభావము విశ్వమంతయు నిండియున్నది. ఈనిగనిగ ప్రతిక్షణమును వర్ణభేదముఁ గలిగి వర్తించును. పాదరసమువలె, బుద్ధి గ్రాహ్యముగ నుండును. బుద్ధినిఁ బాదరసమువలెనే పరువెత్తించును. అట్టి యన్వేషణమునందు బుద్ధి సర్వదా పరుగెత్తుచునేయుండును. అన్వేషితాంశము గ్రహింపఁబడినట్లె యుండి యెప్పటికినిఁ గ్రహింపఁ

బడకయె యుండును. ఇందువలననే బూటకపు విద్వాంసుల గ్రంథములు బహుళములుగా నుండును. యథార్థవిద్వాంసుని సృష్టి అణుత్వమహత్త్వములు గలిగి ప్రకాశించును. బూటకపు విద్వాంసు లన్వేషించు నిగనిగ, ప్రతిపదార్థము నాశ్రయించుటయు, ప్రతిపదార్థమునుండి తొలఁగి పాఱుటయు ననునవస్థాభేదము నొకేక్షణమందుఁ గలిగియుండును గనుక ప్రతిపదార్థమును గూర్చి దిఙ్మాత్రముగఁ గొంతకొంత రూప విశేషము గ్రహింపఁబడును.

యథార్థ విద్వాంసుఁడో పదార్థ సంచయమందు స్వీయాంతఃకరణవృత్తులచే పరిగ్రహ పరిహారణాది భేదకర్మాచరణముఁ జేసి, గ్రహించిన పదార్థములకు రూపకల్పనఁ జేసి ప్రాణప్రతిష్ఠఁగావించి విశ్వమున కంతయు శాశ్వతముగ శ్రేయోదాయకమగు సృష్టిఁజేయును. బూటకపు విద్వాంసునిచర్య యెట్లుండునన సుమాపచయముఁజేసి తాత్కాలికాలంకరణమునకు వినియోగించుట వంటిది. యథార్థవిద్వాంసునిచర్య సుమశోభితమగు నుద్యానమును శాశ్వతముగ స్థాపించుటవంటిది. కావున నిజమైన విద్వాంసు లెవ్వరో గ్రహించి వారియభిప్రాయములనే మన ప్రత్యక్షానుభవముతో పోల్చి, నిశ్చితార్థమును గ్రహింపవలయునుగాని యభిప్రాయసౌష్ఠవము లేని తాత్కాలిక వ్యామోహావేశ ప్రేరణచే నుద్భవించు బూటకపువిద్వాంసుల యభిప్రాయములను పండితుఁ డెవడును విశ్వసింపఁగూడదు.

స్త్రీకి సర్వస్వతంత్రారోపణము కేవల శృంగారచేష్టా రూపమైన మోహావేశమునగాని, తదితరావస్థలయందు లేదని ప్రత్యక్షానుభవమువలన మనకుఁ దెలియుచున్నది. తక్కిన యవస్థలయం దేలలేదు? స్త్రీస్వాతంత్ర్యమునఁ బౌరుషేయ కార్యములయం దధికార ముండుటగా గ్రహింపబడుచున్నది.

కార్యాచరణ ద్వివిధము - పౌరుషేయము, అపౌరుషేయము. పౌరుషేయ కర్మయందు స్త్రీత్వము వహించిన వ్యక్తి కధికారము లేదని సులభముగ సిద్ధాంతీకరింపవచ్చును. కాని స్త్రీలింగ పుంలింగ భేదములకుఁ గారణమేదియో యూహించినఁగాని స్త్రీస్వభావ మిదమిత్థ మని నిర్ధారణచేయుటకు వీలులేదు. ఈకారణమునుగూర్చి ప్రాచీనసిద్ధాంతమును, వర్తమానమందు పాశ్చాత్యశాస్త్రజ్ఞుల సిద్ధాంతమును విమర్శింపవలయును.

పరిణామసిద్ధాంతము (Evolution theory) పాశ్చాత్యజ్ఞానమందు స్త్రీత్వపురుషత్వములు భూతసృష్టికై యేర్పరుపఁబడిన వనియును, అనగా జగద్విస్తృతియే వీనికి గారణ మనియును, ఈ లింగభేదము సమస్తప్రాణులయందును మనుష్యులయందు, తిర్యగాదులయందు, ఉద్భిజ్జములయందు బ్రదర్శింపఁబడినదనియును, ఈ భేదము జలచరములయందు, క్రిమికీటకాదులయందు, తదితరక్షుద్రరూపములందు భిన్నరూపములుగాఁ గనబడకపోయినను, వాని శరీరనిర్మాణమునం దిమిడియున్నదనియునుఁ జెప్పుచున్నారు.

దీనినిబట్టి కేవలము జీవవృద్ధికై మాత్రమే యీలింగ భేద మేర్పరుపఁబడిన దని తేలుచున్నది. ఈ లింగభేదములే కదా జీవోత్పత్తి కాఁగూడదాయని ప్రశ్నింపవచ్చును. వ్యక్తిత్వదశయందు ఏకత్వ బహుత్వస్థితి మన యంతఃకరణమునకు (Intellect) గోచరమగుచున్నది. అట్లు గోచరమగుట అంతఃకరణవిశేషమేగాని యంతఃకరణేతరముగా ఏకత్వబహుత్వస్థితిఁ గలిగినప్రపంచ ముండనేరదు. ఏలననఁ బ్రకృతియంతఃకరణజన్యమే జీవితస్వరూపమును భోగ్యముగాఁ గ్రహించినపుడు దానికిఁ బ్రకృతియను నామ మియ్యబడుచున్నది. అట్టిస్థితిలో అనగా ఏకత్వ బహుత్వములు అంతఃకరణజన్యములే యయినప్పుడు భోగ్యములగు పదార్థ సంచయములకు స్వాతంత్ర్యాధికార మారోపింపఁబడి, తద్ద్వారా స్త్రీపుంస్త్వస్వభావ మారోపింపఁబడి, వాని సాహచర్య సంపర్కముచే బహుజీవోత్పత్తియగు నని చెప్పుట కేవల మంతఃకరణముయొక్క నిజస్వరూపమునే తెలుపుచున్నది గాని వేరుకాదు. అంతఃకరణముయొక్క నిజస్వరూప మెట్లుండున నిన నదియొక దర్పణమువంటిది. నిజరూపమును బ్రతిబింబించినప్పుడు ఇంకొక రూపముగా గాన్పించునటుల భోగ్యము లన్నియు నుద్భవ మయ్యెను. భోగ్యత్వమే స్త్రీ సంజ్ఞతో వర్తించుచున్నది. అందు నిజ స్వరూపము లేదు—ఛాయమాత్రమే. అయినను ఇంద్రియ గోచరమై యంతఃకరణప్రవృత్తి కాధారమై వర్తించుటచేత యంతఃకరణవృత్తి నిలిచియున్నంతకాలము అనగా నపరోక్షానుభూతి సిద్ధము కాకుండునంతకాలము దర్పణాంతర

గోచరమగు ఛాయాస్వరూపము సత్యమే యని గ్రహింపవల యును. వ్యావహారికసత్త్వము భోగ్యములయందు వర్తిం చును. భోక్తృభోగ్యసంబంధముచేతనే ప్రపంచత్వము సిద్ధ మగుచున్నది. సకల జీవరాసులు భోక్తృభోగ్యసంబంధ పరి ణామరూపములు. కావున భోక్తృభోగ్యములను రెండు భేద స్వరూపము లుండనిచో బహుత్వము గలుగనేరదు. అనగా భోక్తకు భోగ్యసృష్టిసమర్థత లేనిచో నీ యేకత్వ బహుత్వ స్థితి తటస్థింపనేరదు. బీజరూపముగఁ బ్రధానపురుషునియం దీసృష్టిసమర్థత యిమిడియున్నది. స్త్రీ పుంస్త్వములు భోక్తృ భోగ్యములకు సంజ్ఞలు. ప్రకృతియందు అమీబా (Amoeba) యను నొక క్రిమి గలదు. అది వృద్ధినొందుటకు స్త్రీపుం స్త్వము దాని జీవితచారిత్రమునందుఁ గనఁబడదు. అది వృద్ధినొందుట యెట్లన నది రెండు భాగములుగా జీలును. అట్లు చీలుటకు దానియం దిమిడియున్న బీజరూపమగు భోగ్యనిర్మాణశక్తియే కారణముగా గ్రహింపవలెను. కావునఁ బ్రజావృద్ధినిమిత్తమే స్త్రీపుంస్త్వభేదము లేర్పడిన వని యీ సిద్ధాంతము తెలుపుచున్నది.

ప్రాచ్యసిద్ధాంతము—స్త్రీపుంస్త్వము లెట్లుద్భవించె నను ప్రశ్నకును "అహమిదమ్" అను ద్వంద్వావస్థ యెట్లుద్భ వించె నను ప్రశ్నకును భేదము లేదు. (బృహదారణ్యకోప నిషత్తు. 1. 4, 3) స్త్రీత్వము "ఇదమ్" అను పదముతో సామ్యము; పురుషత్వము "అహమ్" అను పదముతో సామ్యము; "అహమ్" ఉద్భవించినపుడు "ఇదమ్" అను

పదార్థమును సృష్టింపఁగల శక్తి దానియం దున్నది. "అహమ్" అనునది యెట్లుద్భవించెనో మన కిక్కడ నవస రము లేదు. "అహమ్" అను దానియందు సంయోగ వియో గేచ్ఛ యిమిడియున్నది. అనగా "ఇదమ్" అనుదాని బీజము అనగా ద్వంద్వముయొక్క బీజము ఇందు నాటుకొనియున్నది. ఈ "అహమ్" యొక్క స్వరూపము సంయోగవియోగేచ్ఛా స్వరూపము గనుక ఈ కర్మాచరణము నిమిత్తము "ఇదమ్" అను భోగ్యమును సృష్టి జేయుచున్నది.

O బ్రిహ్మము; లింగభేదరహితము; అనిర్వాచ్యము; అగ్రాహ్యము; సర్వాతీతము; దాని స్వరూపము;

పు | స్త్రీ దీనియం దిచ్ఛాశక్తిబీజముగ నుండును.

విరాట్ లేక ఆత్మ—ఇచ్ఛాశక్తి క్రియారూపముగా నున్న యవస్థ (Objective mental power.)

(ఇది పురుషరూపము) అహమ్ × ఇదమ్ (ఇది స్త్రీరూపము)

"పాతనాత్ పతిః పత్నీచ" ఇది సామాన్యముగా భా ర్యాభర్తల వర్ణనము. దీనినిఁబట్టి పురుషుఁడు స్త్రీరూపమును భోగ్యవస్తువుగ నిర్మించినట్లు కనబడుచున్నది. స్త్రీరూపము కేవలము భోగ్యమునకు సంజ్ఞ. ఎందువలన? సంయోగవియో గాది యోగ్యమైన భోగ్యవస్తువు సృష్టియందలి యిచ్ఛ యేల గలిగెనని యడుగఁగూడదు. ఏలననఁ బృచ్ఛకునికి తనకు ప్రి శ్నించు నధికార ముండవలయునుగదా. తన్నుంగూర్చి తాను ప్రిశ్నించినచోఁ దగు సమాధానము తనయందే యిమిడి

యున్నందున నట్టి ప్రశ్న నిరర్థకము. ఇక దనలోనుండి యీ భోగ్యము నేరీతిగ సృష్టించెనను దానికినూర్ణనాభము(Spider) ఉదాహరణము (ముండకోపనిషత్తు 1-6)

బెర్గసన్ అను పాశ్చాత్యపండితుఁడు సృష్టికంతయు మూలకారణము "Elan Vital or original impetus" అని చెప్పియున్నాడు. ఈ Elan Vital మూలపురుషునియం దిమిడి యుండు భోగ్యనిర్మాణ శక్తియగు స్వేచ్ఛగా గ్రహింప వలయును.

మన ప్రాచీనసిద్ధాంతముప్రకారముగూడ ప్రపంచాభి వృద్ధికై స్త్రీ పుంస్త్వములు నిర్మింపఁబడిన వని తేలుచున్నది. అయిన పాశ్చాత్యులు దురభిప్రాయపడినట్లుగ, సృష్టికర్మ యందుఁగాక తదితర కర్మలయందు స్త్రీపురుషులకు సమా నాధికారము గలదనుట యిచ్చుట నంగీకరింపవీలులేదు. ఏల నన, స్త్రీ భోగ్యముగ నంగీకరింపఁబడినది గద. భోక్తృ భోగ్యములకు కర్మప్రవృత్తియందు సమానత్వము సూచిం చుట స్వభావవిరుద్ధము. కర్మసంచయమందు స్వభావానన్య త్వము గలదు. అనగా ప్రతికర్మయు సంయోగరూపమో వియోగరూపమో గనుక యోగభావ మన్నిటియందును సమానము. సృష్టికర్మకు ఇతరకర్మలకు సంపూర్ణభేదమే గలి గినయెడల పాశ్చాత్యాభిప్రాయము నంగీకరింప నొప్పును. అట్లుకాదు గనుక స్త్రీ విద్యావిధానము పురుషుని విద్యా విధానమునకు భేదముగ నుండవలెను. బాహ్యమునందు భిన్నరూప మయినప్పటికిని సమానాంతర్యము గలిగిన సర్వ

కర్మలయందును ఒకదానియందు భేదవృత్తి గలిగియుండవలసి నప్పుడు, అన్నిటియందును నట్లే వర్తింపవలయును. కావున సృష్టియందు భేదవృత్తి యున్నచో సర్వకర్మలయందును నట్లే భేదవృత్తి యూహింపబడవలయును. కావున స్త్రీ విద్యా విధానము వేరుగా నుండవలయును. స్త్రీ భోగ్య మగుటను పురుషునిచేత సృష్టింపబడిన దగుటను, స్త్రీయొక్క నిజస్వభావముఁ బురుషుఁడే గుర్తెఱుంగఁగలఁడు గాని స్త్రీ యెఱుఁగ లేదు. పాశ్చాత్యపండితు లనేకుల యభిప్రాయములందు, స్త్రీ స్వభావము పురుషుని కగ్రాహ్యమనియును స్త్రీకి సంపూర్ణ విద్యాప్రాప్తి తటస్థించిన యనంతరమే తన్నిజస్వభావము మనకుఁ దెలియగలదనియును నుడివిరి. ఇది యంతయు నసమంజసము. పురుషనిర్మితమగు రైలుఇంజను స్వభావము నిర్మాణకునకుఁ దెలియునుగాని ఆయింజనుకు వ్యక్తిలేదు. వేగ గతియం దుద్దేశము గలవాఁడై, దానిని సృష్టించి దానియం దుద్వేగశక్తి నెలకొల్పెను. మనుష్యుని యనుగ్రహము లేనిది దాని విధ్యుక్తకర్మ జరుగనేరదు. అటులనే ధర్మవృత్తియను రైలు పట్టాలమీద పురుషుఁడు స్త్రీయను నింజనును నడపినచో స్త్రీ పురుషుల కుభయులకు సిద్ధి సమకూరును. స్త్రీ లేనిచోఁ బురుషుఁడు గమ్యస్థానమును త్వరితగతిఁ జేరలేఁడు. పురుషుఁ డేమాత్రము ప్రాలుమాలినను స్త్రీ ధర్మమార్గము వీడి దగ్ధయగును. స్త్రీ పురుషుల కుభయులకును సంబంధము సమానాధికారము గాదు. కృత్స్నత్వము (సంపూర్ణత or Complementing each other) ఈ సంపూర్ణత సాధనకై చెప్పబడినది. పురుష

స్త్రీ సంయోగ స్వరూపము సాధనకు సంపూర్ణాధికారము గలదు. స్త్రీపురుషులకు సర్వకార్యసర్వావస్థలయందును నధికారభేద మున్నట్లు సిద్ధాంతీకరించితిమి గావున విద్యావిధానమునందును నట్లే గావున స్త్రీవిద్యాపద్ధతి చర్చింపవలయును.

---

## ఏడవ అధ్యాయము.

ఆట్టోవినింజరను నాతడు (Sex and Character) అను గ్రంథమున నిట్లు నుడివెను. "ఇందలి సారాంశ మేమనగా ప్రతివ్యక్తియందును గల సూక్ష్మనాడులన్నియు నొకానొక లింగస్వభావమును గలిగియుండును. ఈ నాడులు (Cells) ఒకేశరీరములోనైనను నొకేస్వభావమును కలిగియుండునని తలఁపరాదు."

ఇందుకు భిన్నముగా నేజెలీ, డెర్వీస్, ఆస్కార్ హెర్ట్విగ్ ఇత్యాదు లొకసిద్ధాంతమును నెలకొల్పి యద్దాని కనేకములగు తార్కాణములఁ జూపియున్నారు. వారి సిద్ధాంతము ప్రకారము బహుసంఖ్యాకములైన సూక్ష్మనాడులు గలిగిన శరీరమునందలి ప్రతినాడియు తన స్వజాతీయస్వభావమును గలిగి యుండును. ఈ స్వభావములు లింగకోశములలో (Sexual Cells) నిమిడియుండును. ఈయభిప్రాయమే సామాన్యముగా విశ్వసనీయముగా గన్పట్టుచున్నది.

ఒకే మానవునియందు స్త్రీత్వ పురుషత్వ భావములు రెండును నిమిడియుంటయే గాక పరస్థితుల ననుసరించి యొకే వ్యక్తిలో యొకానొకప్పుడు స్త్రీత్వమును మఱియొకప్పుడు పురుషత్వమును లభించుట గూడ గలదు. ఉదాహరణ: స్త్రీల నడుమనుండు నపుంసకులు. మనము వ్యక్తిస్వభావమును కనుగొనుట కీ విషయమును జ్ఞప్తియందుంచుకొనవలెను. ఇది విద్యా విధానమునందును ప్రధానవిషయముగా గుర్తింపనగును.

పౌరుషేయములగు గుణస్వభావములు గలిగిన స్త్రీలకు వారి చిత్తానుసారముగ వారి వారి శక్త్యర్హతల ననుసరించి పురుషవృత్తులను స్వీకరించుటకు వారి కెట్టి యభ్యంతరములను కలుగజేయక సంపూర్ణావకాశముల నొసంగవలెను. కాని స్త్రీలలో సంఘోద్యమములను మాత్రము వృద్ధిచేయరాదు. స్త్రీయుద్యమము (Women's Movement) అస్వాభావికమును మూలకందములందు దోషపూరితమునై యున్నది. స్త్రీత్వము పురుషుని యొద్దనుండి యెన్నడును విముక్తిని గోరదు.

స్త్రీ తన రహస్యముల నెన్నడును తెలుపదని క్యాంటు నుడివెను. స్త్రీవలన స్త్రీస్వభావ మెన్నడును తెలిసికొన నేరమని నీట్జి వ్రాసెను. స్త్రీయొక్క స్వభావము దెలిసికొనుటకు పురుషునియందలి స్త్రీత్వమువలననే తెలుసుకొనవలెను. స్త్రీకి ఈ విషయములం దెట్టి శ్రద్ధయు నుండదు. స్త్రీ ముఖ్యముగా కాముకురాలు. పురుషుడన్ననో యాతని కాముకత్వ

ముతోఁబాటు మరికొన్ని గుణములనుగూడ కలిగియుండును. స్త్రీ తనయింద్రియములకు బద్ధ. పురుషుడు జితేంద్రియుఁడై యుండును.

స్త్రీకిని పురుషునకును గల ప్రధానభేద మేమి? స్త్రీపురుషుల కిద్దరకును మానసికముగా (Psychic) భేద మేమియు నుండదు. కాని పురుషుని యందలి మానసిక వికాసము స్త్రీయందు కాన్పింపదు. వస్తువులకును వాని స్పర్శాదిగుణములకును గల తారతమ్యమును స్త్రీ గ్రహింపనేరదు. పురుషుఁ డట్టి భేదమును సూక్ష్మముగా గ్రహించును. స్త్రీకి ఆలోచనకును అనుభవమునకును భేదము లేదు. పురుషునకీ రెండును రెండు ప్రత్యేకావస్థలు. స్పర్శదక్క మిగిలిన యింద్రియములన్నియు స్త్రీకంటె పురుషునియం దెక్కుడు సూక్ష్మములై యుండును. స్త్రీకి పురుషుఁడే చైతన్యము నిచ్చును. జీవితమునందలి వివిధావస్థలలో గల యైక్యత స్త్రీకి గోచరించుట దుర్లభము. ఏలయన యెట్టి బుద్ధికుశలత గల స్త్రీకైనను అన్ని విషయములను వరుసగా జ్ఞప్తియం దుంచుకొనుట అస్వాభావికము. ఆలోచన విషయములందు స్త్రీ అంటిముట్టక నడచును. పురుషుడు లోతునకుబోయి పరిశీలించుచోట్ల స్త్రీ పైపైన నత్తగుల్లల నేరుచుండును. నిజస్థితుల నెన్నడును స్త్రీ యెఱుంగ నేరదు. ఒకేవస్తువునుగూర్చి స్త్రీపురుషుల భావములు భిన్నములుగా నుండును. పురుషుఁ డద్దానియొక్క సంపూర్ణతను గ్రహించును. స్త్రీ పైపై మెరుగులతోఁ దృప్తి జెందును.

స్త్రీలలో గల వ్యక్తిత్వభేదములు లోతైనవి కానందున వారిలో ప్రత్యేకవ్యక్తిత్వము వృద్ధిపొందనేరదు. అందుచే సాధారణముగా స్త్రీలలో గల గుణభావములను పురుషుని యొక్క సంకల్పయత్నముచే మార్చుటకు లేక రూపుమాపు టకుగూడ వీలగును.

స్త్రీలలో తల్లికిని వ్యభిచారిణికిని చాల తారతమ్య ముండును. తల్లికి బిడ్డల గనుటయే జీవితాదర్శము. వేశ్యకు కామేచ్ఛ పరమావధి. జాతిని శాశ్వతముగా నుంచవలెనను కోరిక తల్లికి నిర్భయత్వమును ధైర్యసాహసములను కలుగ జేయును. వేశ్య యన్ననో భయమును, పిఱికితనమును గల్గి యుండును. వేశ్యయు నిరంకుశాధికారియు లక్ష్యమెద్దియునులేక తమ మార్గమందలి జీవుల కందరకును సంక్షోభమును మరణ మునుగలుగ జేయుచు నగ్నిహోత్రునివలె సర్వభక్షకులై పిమ్మట తామును నాశనము జెందుదురు. కాని తల్లియు మేధావియు (genius) నిశ్చలులై భావిక్షేమమునకు పాటుపడుదురు. సహ జమయిన స్త్రీలలో గాఢాభిప్రాయముండదు. స్త్రీకి భర్తపై నా ధారపడియుండుటయే మహాశయము.

పురుషునకు ప్రేమ హెచ్చైనకొలదియు కామాతురత తగ్గును. కామాతురుడైనవానికి ప్రేమ స్వల్పముగ నుండును. స్త్రీపురుషులు సామీప్యమున నున్నచో కామేచ్ఛ వృద్ధిబొం దును. ప్రియురాలు దూరముననున్నపుడు ప్రేమ ద్విగుణీకృత మగును. ప్రేమ శాశ్వత మగుటకొకింత యెడబాటు దప్పక అవసరము.

సౌందర్యము ప్రేమాతిశయములచే కల్పితమగు నారోపణ. పురుషుని ప్రేమయే స్త్రీ చక్కదనమును సృష్టించును. స్త్రీ పురుషుల సంబంధమందు పురుషుడు స్త్రీయందు తననే ప్రేమించుచున్నాడు. అనగా తనయందలి లోపాలోపములను గుణదోషములను నైచ్యభావములను కాదు. తన యుత్తమాదర్శములను పారమార్థికాశయములను తన ప్రేయసియందు రూపకల్పన మొనర్చి వానిని ప్రేమించును. ఈ ప్రేమ లేనిదే తన జీవితమునకు సంపూర్ణత్వము లభింపదు.

ప్రేమ ద్వేషమును మనలోనుండి బయల్వెడలు నారోపణలే. ప్రేమప్రపంచమున సమానత్వ ముండదు. స్నేహభావము సమానత్వమును సూచించును. సరి సమానులకు మాత్రమే మైత్రి చేకూరును. ప్రేమ యసమానత్వమును సూచించును. ఒకానొకని యాశయ మంతయు, అనగా తనలో లేనట్టియు తన కిచ్ఛగలయట్టియు గుణగణముల నన్నింటిని తన ప్రేయసియం దారోపించి యద్దానిని ఆదర్శప్రాయముగ జేసుకొనుటయే ప్రేమ. ఈ యారాధనకు చిహ్నము సౌందర్యము. పురుషుడు ప్రేమచే యథార్థస్త్రీని ఆదర్శప్రాయురాలినిగ జేయును. అటులనే కళయు నీ ప్రకృతినుండి కోటానకోట్లగు రూపములను సృష్టించును. వీ రుభయులును తమ సృష్టిని తమలోనుండియే వెలిబుత్తురు.

స్త్రీ చంచలచిత్త. స్త్రీకి భోగేచ్ఛ మెండు. కాని యీ యిచ్ఛకు నైచ్యభావ మారోపింపజనదు. ఈ యిచ్ఛ స్వార్థ

పరమగునది కాదు. జాత్యభివృద్ధియే యిందులకు మూల కారణము.

స్త్రీస్వభావమందు మరియొక విశేష మేమన యాపె యితరుల యభిప్రాయములను నిశ్శంకముగ గ్రహించుటయు నెట్టి నూతనవిషయములందును సత్యాంతేచ్ఛ గలిగియుండుటయు తననిజాభిప్రాయములయెడ మూకీభావముగ నుంటయు, యితరు లేవి చెప్పిన నామాటలను స్త్రీ త్వరగా నమ్మును.

స్త్రీలు మతావేశపరు లనుకొనుట పొరబాటు. సాధారణముగా స్త్రీలభక్తి మూఢముగ నుండును. కొందఱు తమ ప్రియులనే దైవముగా భావించి పూజించెదరు. లేనిచో తమ భర్తలమతమునే స్వీకరింతురు. సహజముగ తమ స్వభావములు మతవిషయములందు జోరలేకుండుటచే యీ భావములయెడ వీరు గాఢానురాగము గలిగి యుందురు. ఈ కారణముచేతనే కొందఱు స్త్రీలు తమ భర్తలనే దైవములుగాను మరికొందఱు దైవమునే భర్తగను గూడ భావించుట కలదు.

పురుషుని యాత్మవిశ్వాసమే యాతని మతము. స్త్రీ యొక్క మతము సంపూర్ణముగా పరులను విశ్వసించుట. స్త్రీకి వ్యక్తిత్వ సంకల్పములు లేకుండుటచేతను యథార్థమైన విలువ గాని, ప్రేమగాని యెరుంగకుండుటచేతను పరమార్థవిషయములందామెకు అధికార ముండదు. ఆమె మతము భోగమే.

స్త్రీ విచక్షణ చేయునట్లుండును గాని యాపెకు విచక్షణశక్తి యుండదు. భాషయుండునుగాని సంభాషణపాటవ

ముండదు. ఆకొజ్ఞాపకశక్తియందు సమగ్రత గాని సమన్వయము గాని యుండదు. స్త్రీలలో గౌరవము, లజ్జ, ప్రేమ, ఊహ, భయము మున్నగు అనేకభావములు కాన్పించును గాని వాటిలో నొక ప్రత్యేకవ్యక్తిత్వము కాన్పింపదు.

స్త్రీ ప్రకృతి - పురుషుఁడు రూపము.

విద్యచే పురుషస్వభావమును మనము మార్పజాలము. కాని విద్యాభ్యాసముచే స్త్రీయొక్క గుణములను కొంతవరకు మార్పనగును.

స్త్రీ పురుషునియందే యిమిడి యున్నది. మొట్ట మొదట పురుషుని సంకల్పముననే యామె యుద్భవించెను.

అర్థరాహిత్యమే స్త్రీపదమునకర్థము (The meaning of woman is to be meaningless).

పురుషుడు కాముకుడై యున్నంతకాలమును స్త్రీని నూతనముగా సృష్టించుచునేయుండును. ఆమెకు చైతన్యమునే గాక జీవితముఁగూడ నిచ్చును.

పురుషునియొక్క పాపఫలమే స్త్రీ (woman is the sin of man.) తన పరమార్థమును తాను విడచినపుడే పురుషుడు స్త్రీకి ఉనికిని యిచ్చును.

స్త్రీకి విద్యనొసఁగుటకు స్త్రీలు అర్హులుకారు; పురుషులకు విద్యనిచ్చుటకు (తల్లులు పనికిరారు.)

ఇందు స్త్రీపురుషులలో ఉత్తమాధమాధికారము లను మాట యన్వయింపదు.

మిల్టను Paradise Lost Vol. IV అను గ్రంథములో స్త్రీ పురుషునితో నిట్లనెను. "నా సృష్టికర్తవును, హర్తవును నీవే, నీయాజ్ఞలను నేను శిరసావహించెదను. ఇది దైవనిర్మాణము, నీకు శాసనకర్త దైవము. నాకన్ననో నీవే. ఇంతకు మించి స్త్రీ తెలిసికొనవలసిన జ్ఞానము లేదు. ఇదియే యామెకు సౌఖ్యావహము. ఆనందదాయకమును."

మహమ్మదీయ మతగ్రంథమగు ఖురానునందిట్లు వ్రాయబడెను.

"ఓ పురుషుడా! నిన్నొకమానవునినుంచి యీశ్వరుడు సృష్టిజేసెను. నీవు ఈశ్వరునికి వెరువుము. ఆ మనుష్యునినుండి యాతనిభార్యయు సృష్టినొందెను. వారుభయుల నుండియు ననేకమంది, స్త్రీపురుషు లుద్భవించిరి. ఈశ్వరుడు తమ కొసంగిన యతిశయములచే పురుషులు స్త్రీలకంటె హెచ్చు గౌరవపాత్రులని యెఱుఁగునది. (అనగా బోధనాశక్తి; భుజబలము; ధర్మరక్షణార్థై యుద్ధములకు బోవుట; స్త్రీలను పోషించుట). వీనికై స్త్రీకంటె రెండురెట్లు హెచ్చుఆస్తిని పురుషుడు పొందుచున్నాడు. పతివ్రతలైన స్త్రీలు తమభర్తలకు విధేయలై తమభర్త లూరలేనప్పుడు జాగ్రత్తతో మెలగుచుందురు. దైవము వారిని పురుషులకు అప్పజెప్పెను. దైవము మమ్ము ముందు మట్టినుండియు, పిమ్మట బీజమునుండియు సృష్టించెను. పిమ్మట మిమ్ము భార్యాభర్తలుగ జేసెను. ఏస్త్రీయైనను పురుషుడువినా గర్భవతి కానేరదు."

అపరోక్షానుభూతిసామర్థ్యమే జీవితాదర్శము. ఇది ప్రత్యక్షానుమానసిద్ధాంతప్రకారము స్త్రీజాతియం దెక్కు-డుగ గానిపింపదు. కాన నపరోక్షానుభూతిసామర్థ్యము అనగ సంకల్పసామర్థ్యము పురుషునిదేయని మనము నిర్ణయింపవలసియుండును. ఇందువలనఁ బురుషత్వము గల స్త్రీలు లేరని మన మెంచరాదు. బీజక్షేత్రసంయోగమే రూపమగుచున్నది. బీజమన శుద్ధ సంకల్పరూపమై శక్త్యాత్మకమైన (విస్తృతి జేయఁగల సమర్థత గలది - or inherent potentiality) పదార్థవిశేషము. క్షేత్రమన బీజమునకు భోగ్యస్థానమై బీజముయొక్క సంయోగమువలన విస్తృతిఁ జెందు పదార్థవిశేషము. బీజగర్భితమగు క్షేత్రము రూపపరంపరకుఁ గారణ మగుచున్నది. నానాత్వరూపసంపద నొందిన విశ్వమంతయు బీజగర్భితమగు క్షేత్రముయొక్క పరిణామము. సృష్టి యెట్లు కలిగెనో మనము బుద్ధిచేతఁ బ్రశ్నించుట కధికారముఁ గలిగియుండలేదని యిదివరకుఁ జెప్పబడినది. కారణకార్యవిచారణ మెంతవరకు జరిపినను నిజస్థితి నెఱుంగ వీలులేదు. ఏలనన మనము ప్రశ్నించు నంశమే ఏతద్విచారణయందుఁ బ్రశ్నకర్తృతా రూపమగు నంగీకారముఁ బొందుచున్నది దీనినిఁబట్టి సర్వసృష్టికిఁ గారణము "నే" ననియే బోధపడుచున్నది. (బృహదారణ్యకమ్. 1-4.)

(Whenever we proceed from cause to effect we must assume the potentiality) కారణమునుండి కార్యము నూహించునప్పుడు 'అహమ్' (I-ness) అనునది ప్రశ్నా

ర్వాతఁ జెందదు. దానిని సృష్టిస్థితిలయశక్తులు బీజరూప ముగఁ గలిగియున్నదానినిగ గ్రహింపవలయును. స్థితిలయాదులు సృష్ట్యనంతరము గనుక ప్రప్రథమమున సృష్టిశక్తియే విజృంభించును. దాని ననుసరించియే, ప్రప్రథమమున ఆత్మయె పురుషరూపముగ నున్నదనియును, ఉండి యనువీక్షించినదని యును (అనగ సృష్టిశక్తిఁ జూచుటయను కర్మనాచరించినది) ఇతరమైన పదార్థములేక తననె చూచెనని చెప్పబడినది. (బృహదారణ్యకము 1-4-1) అనగ చూచుటయను కర్మచే "చూడబడునది" అను పదార్థమును సృష్టించి తానె చూడ బడినది. ఆచూడబడినదియె "ఇదమ్" - ఈవిశ్వమంతయునుఁ గా భావింపవలయును. ఈ "ఇదమ్" అనునదియె కార్యకా రణ శరీరము. ఈ చూచుటయనునది ద్వితీయావస్థ. ఈ యవస్థయందు చూచియున్నది - ఇది నేనే యను నభిప్రాయ ముఁబట్టి యీయవస్థయందున్న యజమానునికిని దీనివెనుకటి యవస్థయందున్న యజమానునికిని అనన్యత్వము సూచింప బడుచున్నది. ఈకార్యకారణశరీరము 'నేనే' యని చెప్పుటలో దానికి యజమానిభావము లేనట్లు సూచింపఁబడినట్లు సూచిం పఁబడినది. అనగ అది నాకుఁ జెందినపుడె దానికి స్థితి గలదు. కావున రెండుపదార్థములు అవ్యావహారికమందంతయు నిండి యున్నవని గ్రహింపవలయును. యజమానుఁడైన నేను, నాది యను స్వభావముగల సర్వశక్తిసమన్వితుఁడైన బీజరూపమును చూడబడునదియు, ఆస్వాదింపబడునదియు, కార్యకారణ కలాపమునకుఁ బుట్టినిల్లయినదియు, నేననుదానికిఁ జెందినదియు

నే నను యజమానియనుగ్రహముచేత స్థితిఁ బొందినదియు, క్షేత్రరూపియునగు రెండవపదార్థము మొదటిపదార్థమునకు వేదమున "పురుషః" అనుసంజ్ఞ యొసంగబడినది. అట్టిసంజ్ఞను మనము విడనాడుట కధికారము లేదు. బృహదారణ్యము 1-4-1లో, సమస్తపాపముల దహనముచేసినవాడుగనుక పురుషుడు అని చెప్పఁబడినది. పాపము లెవ్వియని యడిగినచో, భాష్యమందు ప్రజాపతిత్వసిద్ధికి సంగత్వము ఆటంకముగ నేర్పడున వన్నియు పాపము లని చెప్పఁబడినది.

జ్ఞానమునకు ఆధారములు శ్రుతి, స్మృతి, సదాచారములు. వీని ననుసరించి యధికారికి "పురుష" శబ్దమే వాడఁబడుచున్నది. కావున స్త్రీ యెన్నఁటికిని ప్రభ్వి కానేరదు.

విషయతత్త్వ విచారణకు వలయు మార్గములు రెండు. 1. వ్యావహారికము 2. పారమార్థికము. వ్యావహారికమనఁ బ్రత్యక్షాధారము, నానాత్వస్థితి, వ్యక్తిత్వదశ, సంసారావస్థ, పారమార్థికము, అపరోక్షము, అవ్యక్తస్థితి, ఆనందావస్థ. ఈ మార్గములు సాధనమార్గములుగ గ్రహింపవలయును. వ్యావహారికమార్గమున నడచినచో విశ్వమంతయు భేదమయముగాను, అనంతనామరూపములు గలిగినదిగను, అనంతావస్థలతో నిండియున్నదిగను కనఁబడును. పారమార్థికమార్గమున నడచినచో, విషయమంతయు ననగా విశ్వము భేదరహితమై, అనన్యత్వము నొంది, స్వయంప్రకాశమై, స్వస్వరూపమై, సర్వాతీతమై కనఁబడును. పారమార్థికమందు స్త్రీపుంస్త్వనపుంసకాదిలింగభేదములు లేవు. వ్యావ

హారికమందే యథాస్థితి సంభవించును. ఈ రెండుమార్గ
ముల కుండు సంబంధము ఏతన్మార్గచరులగు వ్యక్తులను బట్టి
సిద్ధాంతీకరింపవలయును. కొందఱకు రెంటియందును సమాన
ప్రభుత్వము కలదు. కొందఱకొక్కదానియందే గలదు. వ్యవ
హారమందే ఉత్పత్తిస్థితిలయములు కలవు. కనుక దానియందే
అట్టి ప్రశ్న లుద్భవించును. సృష్టినిగూర్చి విచారణ, వ్యావ
హారికమునందే స్ఫురించును గనుకను, అట్టివిచారణ వలని
ప్రయోజనము వ్యావహారికమునందే వినియోగించును గను
కను సృష్టి యొక్క యుత్పత్తిస్థితిలయములనుగూర్చియే మన
ము చర్చింపవలయును. ఈ చర్చ దేశ, కాల, కార్య
కారణ సంబంధాది వ్యావహారిక నియమముల ననుసరించి
జరుపఁబడవలయును. (Time, space and causality are
fundamental intuitions.) సృష్టియుత్పత్తినిగూర్చి మనము
చర్చఁజేసినాము. ఉత్పత్తియన దైహికము (Physical), మాన
సికము (Psychological - chronological and logical)
దైహికముగఁ బురాణేతిహాసముల యందును, ఉపనిషత్తుల
యందును, వివిధదేశముల యుత్కృష్ట గ్రంథముల యందును
గనంబడు సృష్టివిచారము మనకు సహాయకారిగ నుండును.
మానసికముగ, ప్రత్యక్షానుమానోపమానాది ప్రమాణ
ములు అనగా జ్ఞానాన్వేషణమార్గములును, శ్రుతిప్రమాణము
లును, మనకు సహాయభూతములు. మహాపురుషుల యభి
ప్రాయములును మన కిందులకు మార్గదర్శకములు.

పారమార్థికవిషయములో సర్వవ్యక్తులకును మోక్షాధికారము కలదు గనుకను, మోక్షాన్వేషణమందును, సంసారనివృత్తియందును, సర్వవ్యక్తుల కధికారము కలదుగనుకను స్త్రీకిని సంసారనివృత్తియందును, ఆనందావాప్తియందును నధికారము కలదు. సంసారనివృత్తి యనుచో సంసారావస్థానుభవానంతరమె, స్త్రీకి దన్నివృత్తియందు లక్ష్య మేర్పడనగు. ఈ సాధనకు గుణకర్మాదుల ననుసరించి, వ్యక్తిభేదముల ననువర్తించి, మార్గములు మాత్రము భిన్నములై యుండవలయు. అనగా విద్యావిధానమును, కర్మపద్ధతియు వేరుగ నుండవలయును. "ఉత్తమ" "అధమ" అను పదములు అధికారభేదమునకు వ్యవహరించుటవలనఁ దలుస్థించిన యపోహాలు. వివిధవ్యక్తుల సాధనమార్గములను ఆవహించి దురభిప్రాయముల నుద్భవింపఁజేయుచున్నాము. ఆ యా శాస్త్రజ్ఞుల మతభేదముల ననుసరించి తమ కేది యుత్కృష్టమార్గమని తోఁచునో దానిని సాధించుటకు సమర్థత గలిగిన వ్యక్తులను ఉత్తమాధికారు లనియును తమ మతమందు సులభమైె, సామాన్య లని తమచే నెన్నఁబడువారికి యోగ్యమై, దీర్ఘకాల మనుష్ఠించి సిద్ధిఁబొందఁదగు మార్గమునకు యోగ్యులగు వ్యక్తులకు అధమాధికారులనియును జెప్పుట సామాన్యముగ నున్నది. ఒక్క మహాపురుషుని యభిప్రాయమందున్న యుత్తమాధమత్వములు ఇంకొక మహాపురుషుని యభిప్రాయమందుఁ దలకిందుగఁ గానఁబడును. కావున నిట్టి యెన్నికల ననుసరించి స్త్రీల కధమత్వ మారోపింపఁబడిన దనియును,

పురుషుల కు త్తమత్వ మారోపింపఁబడినదనియును, వాదించు టవలన స్త్రీపురుషులయొక్క వ్యక్తివిశేషము వ్యక్తిభేదమును తదనుసరణమైన సాధనమార్గభేదమును బోధపడకుండుటయే గాక యనేక దురభిప్రాయములకుఁ గూడ నాస్పదమగు చున్నది. పారమార్థికావస్థం జెందుటకు స్త్రీపురుషుల కుభయులకును నధికారముగలదు. కాని మార్గభేదము (అధికారము) మాత్రము కలదు.

విద్యావిధాన మేర్పరచునది ధర్మశాసనుఁడు. ధర్మము జనసామాన్యమునకే యేర్పడును. అందుత్తమాధికారులకు ధర్మము స్వయంకృతమే, స్వతంత్రానుసారమే. ధర్మశాసనుడు ప్రత్యక్షపరోక్షాపరోక్షములను మూడింటిని సంపూర్ణముగ జూచినవాఁడు. అట్టివా డేర్పరచు ధర్మనియమములు వివిధగుణకర్మలచే విరాజిల్లుచున్న వ్యక్తులకు వివిధగుణకర్మానుసారముగ వివిధనియమముల నేర్పరచును. స్వశక్తిని గోచరించు వ్యక్తి యీనియమములచే బద్ధమైయుండవలసిన యావశ్యకత లేదు. ఈ నియమము లన్నియును స్వతః నియమనిర్మాణ శక్తిలేని వ్యక్తులకే వర్తించును. స్త్రీనిఁగూర్చి చేయబడు చర్చ స్త్రీధర్మమునుగూడ సిద్ధాంతీకరించుట కుపయోగపడు చున్నది. మహాపతివ్రతలగు స్త్రీలు స్త్రీధర్మశాసితలే అనగా లక్ష్యములనిభావము. వ్యావహారికమందు ధర్మశాసనాధికారము స్త్రీకొసంగుటకు అట్టిస్త్రీకి సంపూర్ణశక్తి యున్నపుడే. శాక్తేయులలో స్త్రీకి ప్రధానత్వ మొసఁగబడినది. అయిన సతీత్వము నొందిన స్త్రీకే యట్టిధర్మశాసనాధికారమున కర్హత

గలదు. కాని యోనతి పురుషవ్యక్తిచే సృష్టింపఁబడినది. ఈ రూపమునకుఁ దర్శి పురుఁషుడే. కావున నట్టి మహోద్సృష్టి కధికారముఁ గలిగిన పురుషుడే ధర్మశాసనాధికారమున కర్హుఁడు. కావున మహాపతివ్రతలకు స్త్రీధర్మనియమముల నేర్పరచుటయందు భాగము కలదు. ఇందు కుదాహరణము - సత్యభామాద్రౌపదీసంవాదము. మహాపతివ్రతలందఱు, మహాపురుషులవలె లక్ష్యము నిమిత్తము సృష్టింపఁబడినవారు. అట్టిసృష్టికర్తయె ధర్మశాసనాధికారముఁ గలిగియుండును. ఈ నియమముల ననుష్ఠించుట కవసరములేదని తలచి, సర్వజనాంగీకారముగ మహానుభావుల సమ్మతి ననుమతించి వేరొక జీవితవిధానమేర్పరచుకొని యేస్త్రీయైనను వర్తించినచో తద్వర్తనము గూడ స్త్రీధర్మముగ గ్రహింపఁబడుచున్నది. కాని, సృష్ట్యాదినుండి నేటివరకట్టి దృష్టాంతము లల్పసంఖ్యాకములు. ఈనియమములును దేశకాలపాత్రముల ననుసరించియె వర్తించును. శతృవిజృంభణమపుడు దుర్భిక్షము ప్రబలిన సమయము మొదలయిన దుర్నిమిత్తములయందును ధర్మము సర్వజనసామాన్యముగ వర్తించును. సామాన్యస్థితియందుఁ ధర్మనియమములు వర్తించును. - (Rf. Rousseau's Emile Book V)

## సంక్షేపము.

స్త్రీపురుషస్వభావభేదములు, వారి స్వధర్మభేదములు వారి సాధనాలక్ష్యములు, వారి సాధనాపరికరములను నీ నాలుగింటిని మనము విచారింపవలయును.

ప్రస్తుతకాలమం దీ చర్చనుగూర్చిన పూర్వపక్షపద్ధతి యేదనగా:— స్త్రీలకు విద్యనొసంగక, స్వాతంత్ర్యమును తీసివేసి, పురుషులకుఁ బానిసలనుగాఁ జేసి, సర్వవ్యక్తులకు సమానముగ వర్తింపనగు లక్ష్యములను పురుషార్థములను స్త్రీలకు లేకుండ జేసి, కేవలము పురుషుల కుపయుక్తములయిన సామగ్రిగ జేయబడినారనియును, అట్లుచేయుటకుఁ బురుషుల దౌర్జన్యమే కారణమనియును చెప్పబడుచున్నది. దీనిస్ఫురణ స్త్రీలను పురుషులవలె భావింపవలెనని కనఁబడుచున్నది. ఈ పూర్వపక్షమును విమర్శింపవలసి వచ్చినది గనుక స్త్రీ యొక్క స్వరూపస్వధర్మ విచారణయందుఁ బౌరుషేయకర్మల నాచరించుటకు స్త్రీ కెందువలన యోగ్యతలేదో, యేయే స్వభావము లట్టియోగ్యతకు విరుద్ధములో, మొదలగు వైరుధ్యరూపములగు గుణభావవిశేషములకే ప్రాముఖ్యత యొసఁగబడినది. అదియునుగాక, ప్రస్తుతకాలమందున్న యభిప్రాయములలో నున్న మెతకఁదనమును విశేషముగవిమర్శింపవలసిన యావశ్యకతచే, చర్చయందు స్త్రీస్వభావము కొంత యేహ్యముగ గమనింపఁబడు సందర్భము తటస్థించును. స్త్రీ పురుషుల యొక్క స్వభావ స్వధర్మభేదములు వారి యుత్తమాధమత్వములఁ గూర్చి యేమియు వచింపవు. ఈ విచారణకుఁ గారణమేదియో యొక్కింత యోచింపవలసియున్నది.

ఉన్నత మననేమి? అధమ మననేమి? ఈవిశేషణములు ప్రజ్ఞకుఁ (Genius i. e. universal comprehension) జెందును. దాని పరిమాణమును (extent) దెలుపును. ప్రజ్ఞా

సమృద్ధి యాధిక్యమును, ప్రజ్ఞాహైన్య మధమమనియును నైజముగనె గ్రహింపఁబడుచున్నది. ప్రజ్ఞ వివిధస్వరూపములు గలది. సాధనాభేదముల ననుసరించి యీ వివిధస్వరూపములఁ గుర్తింపనగును. స్త్రీలకన్నఁ బురుషు లధికులని చెప్పినచో స్త్రీ పురుషులకు సాధనావిధాన మొక్కటియే యనియును, దానియం దుభయులకు బ్రజ్ఞా తారతమ్యము గలదనియును, స్ఫురించుచున్నది. స్త్రీ పురుషులు సమానాధికారులే యని చెప్పినప్పుడు గూడ (Vide Tathvabhushan's Philosophy of Brahmoism, last chapter) నీ స్ఫురణమె గ్రాహ్యమగును. స్త్రీ పురుషులకు సాధనా విధాన మొక్కటి కానేరదని యిదివరకె విమర్శింపఁబడినది. సాధనా విధాన మొక్కటి కానప్పుడు ప్రజ్ఞాతారతమ్య విచారణ యసంభవము. ఇట్టిచో "అధిక్యాధమత్వములు" దూష్యములు. స్త్రీ పురుషులకు వ్యావహారికమందు వ్యతిరేకమేగాని విరోధములేదు. ఆధ్యాత్మికమందు సమన్వయము. పురుషునకు అధికారము యోగము, భోగము స్త్రీకి అనురాగము, సతీత్వము (There is no comparison between man and woman. Values of inferiority and superiority are inapplicable.)

---

## ఎనిమిదవ అధ్యాయము

# స్త్రీ - విద్యావిధానము.

ప్రథమమున లక్ష్యములనుగూర్చి విచారింపవలయును. పురుషార్థములు స్త్రీకి అన్వయించునాయను ప్రశ్న యిచటనె విచారింపవలెను. (1) స్త్రీ పురుషునిచేఁ దనకు సాధనసామగ్రిగ సృష్టింపఁబడినది గనుకను అనగా స్త్రీత్వములేనిది పురుషత్వము సంపూర్ణము కాదు గనుకను, అనగా స్త్రీ పురుష సంయోగావస్థయె ధర్మాచరణమం దధికారము కలిగియుండును గనుకను, అనగా పురుషత్వము దారపుత్రాది పరిణామమున్నప్పుడె సార్థకముగనుకను, (2) వ్యవహార ప్రపంచముననె స్త్రీ పుంస్త్వాదిలింగభేదము లుండునుగనుక, స్త్రీ, కర్మ ప్రపంచమందే అనగా సంసారమునందె వర్తింపవలసిన యావశ్యకత యున్నందునను, (3) పురుషార్థములందు ధర్మార్థములును కామములోఁ గొంతభాగమును కర్మాన్వితములు గనుకను స్త్రీ ధర్మార్థకామ పురుషార్థముల మూటిని నారాధించి సిద్ధినొందవలయును.

(1) స్త్రీ పురుషునిసాంగత్యములేనిచోఁ కర్మాచరణకు స్వతంత్రరాహిత్యముచేత యోగ్యురాలు కాదుగనుకను, (2) ధర్మార్థకామములందు సాధనమార్గమును నియమించుటకును, తత్పరికరణమును సమకూర్చుటకును, సమర్థత పురుషునికే గలదు గనుకను, పురుషుఁ డది సమకూర్చిన దానుక నె

సాధనయందుఁ బాల్గొనుటకు స్త్రీకి వీలగుటచేతను, స్త్రీ సహచారిణియై, సహపాఠియై వర్తింపవలయును. కావున స్త్రీవిద్యావిధానమునకుఁ బురుషుఁడే నియామకుఁడు. పురుషార్థసాధనకు స్త్రీ కెంతవరకు భాగముకలదో దానిని గుర్తెఱిగి తదనుసరణముగా విద్యావిధానమును నెలకొల్పవలెను.

ధర్మము:— ప్రతి కర్మయందును, స్త్రీకి సాహచర్యమందే సమర్థత కలదుగనుకను, స్వతంత్రాధికారము లేనందునను ధర్మమందును నట్లే గ్రహింపవలెను. దేవ, ద్విజ, పితృసమారాధనయును, భూతహితమును, ప్రపంచవృద్ధియును ధర్మకర్మలై యున్నవి వీనియందు పురుషునికి సహచారిణిగా ధర్మపత్నిగా స్త్రీ వర్తింపవలెను. ఇట్టి కర్మానుష్ఠానమునకు యోగ్యమయిన విద్యాపద్ధతియందు స్త్రీకి అనుష్ఠానభాగము ముఖ్యముగ నేర్పఁబడవలయును. ఇందుకుముఖ్యముగ నితిహాసపురాణములు వ్రతాదులు, నియమవిశేషములు స్త్రీవిద్యాభాగములై యున్నవి. ధర్మకర్మయంతయును స్వగృహమందు స్వనివేశనమందుఁగాని స్వగృహము మూలాధారముగగాని యేర్పరుపఁబడి, సంపూర్ణాధికారమును, సంపూర్ణ కర్తృత్వమును, గృహస్థునియందే నిలుపఁబడియుండును. ఆవంశముయొక్క సాంప్రదాయ విధినిషేధములందును, ఆ కుటుంబముయొక్క స్థితిగతులందును, ధర్మకర్మానుష్ఠానమునందు, తనకుఁగల సమర్థతనుగూర్చిన విషయములయందును పురుషుని వాక్యమె చెల్లవలయునుగద. కేవల మనుష్ఠానవిధానమునందే స్త్రీకి విద్యావ్యాప్తిఁ గలిగింపవలయుననుటకు కారణము స్త్రీ ఒకయింటఁబుట్టి యిం

కొకయింటఁ గాపురముచేయు స్థితివలననె యని భావింపవలయును. కొన్ని దేశములందు (మళయాళము) పురుషుఁడు స్త్రీ యింట నుండుట లేక స్త్రీకి సంసారావస్థలోనుకూడ దనయింటనె వసియించుట యాచారమైయున్నది. అచ్చటి ధర్మకర్మ భేదముగ నుండును. (Encyclop. Brit. on Women)

ధర్మ మిదమిత్థమని శాస్త్రములందుగాని, శ్రుతులయందుగాని ఆచారములందుగాని చెప్పఁబడియున్నను, స్వభావ, స్వాధికార సమర్థతలననుసరించియు, వ్యక్తి భేదముననుసరించియు ధర్మమందు మూలసూత్రములనుమాత్రము స్వీకరించి తదనుసారముగ ననుష్ఠానభేదము వర్తింపవలయును గనుక ఆయా కుటుంబములందు స్త్రీలో పురుషులో అట్టియనుష్ఠానభేదమును గుర్వనుమతిప్రకారము సిద్ధాంతీకరింపవలయును. ఇదియె ధర్మకర్మాచరణకుఁబూర్వము వర్తించు "సంకల్ప" మనబడును. (Moral conduct is born of an inherent necessity; it is not philanthropic. It is a very necessary condition of our existence) ఈ సంకల్పమునకుఁ గర్తయగుటకు పురుషుఁడే యోగ్యుఁడని మనము విచారించినాము. ఏలనన గురుకులవాస మనేక సంవత్సరములుచేసి జితేంద్రియత్వము సంపాదించి వేదశాస్త్రాధ్యయనము గావించి, సంసార వ్యవహారములందు నిశ్చలచేతస్కుఁడై వర్తించు సమర్థత పురుషునికే గలదుగద. స్త్రీ కిది యుక్తముకాదు. స్త్రీలు యుక్తవయస్సు వచ్చినవెంటనే దేహదార్ఢ్యత ననుసరించి ప్రజావృద్ధియేముఖ్య కర్తవ్యముగ భావింపవలసినవారు. స్త్రీ బ్రహ్మచర్యము వహిం

చుచోఁ ప్రపంచము నశించును. కావునఁ బురుషుఁడే సంకల్పమునకుఁ గర్త. తత్సంకల్పానుసారముగ ననుష్ఠానముఁ జరుపుటకు స్త్రీ యోగ్యురాలగును. అయిన, అనుష్ఠానవిధుల నేర్పరచుటయందును సంకల్ప నిర్వహణోన్ముఖుఁడు గనుక, తత్కర్తయగు పురుషుఁడే సమర్థుఁడు. కావున స్త్రీ సాహచర్య పద్ధతులనే విద్యయం దభ్యసింపవలయును. ధర్మకర్మల నీక్రిందివిధముగ భాగింపవచ్చును. (1) దైవారాధన (worship - congregational and personal) (2) ద్విజారాధన, (Civic, humanitarian and other allied forms of action) (3) గృహపరిపాలన ప్రజావృద్ధి లేక గృహకర్మ - దీనినిబట్టి ధర్మకర్మత్రయంతయు ఆరాధనారూపమని కన్పట్టుచున్నది. ఆరాధనయన, "ఆరాధనం సాధనేస్యా దవాప్తౌ తోషణేఽపిచ". ఆరాధన శబ్దము కర్తకు సాధకత్వము నారోపించుచున్నది. సాధకరూపము కల్పితరూపము — ఉపనయనానంతరము తటస్థించునది. ఇట్టి రూపము స్త్రీకి వివాహమువలనఁ దటస్థించును. (మనుస్మృతి అ 2. 67) స్త్రీకి వివాహము ఉపనయనముగా చెప్పబడినది. స్త్రీకి వివాహమువలనఁ గర్మాచరణకు లక్ష్య మేర్పడుచున్నది. వివాహముకాక స్త్రీ ధర్మకర్మకు యోగ్యురాలు కాగూడదను నంశము పైన విచారింపఁబడినది. కావున వివాహానంతరము, ధర్మకర్మాచరణకు యోగ్యురాలగు స్త్రీ తనసాహచర్యమునకు వలయు విద్యావిశేషము నభ్యసింపవలయును.

వివాహపూర్వ మేల విద్య నభ్యసింపరాదను ప్రశ్నకు సమాధానము:—స్త్రీసాహచర్యమును గూర్చిన విశేషమే

నేర్చికొనవలయునుగద. ఈసాహచర్యమునకు లక్ష్యము భర్తయే. భర్త యొక్క వ్యక్తి. వ్యక్తిభేదముచేత సాహచర్యమందు గూడ భేద ముండును. సాహచర్యవిధానము ఆవ్యక్తియొక్క స్వభావస్వధర్మముల ననుసరింపవలయును. పురుషవర్గునకు అంతకుఁ గలిగిన సాధారణస్వభావమును గ్రహించి తదనుసరణముగ స్త్రీ సాహచర్యవిధానము నేర్పరచి, స్త్రీ సామాన్యమున కన్వయింపఁజేసినచో, దానివలన స్త్రీ స్వభావ మెట్లుండవలయునో తెలియునేకాని, ఆయా (ప్రత్యేక) స్త్రీల చర్య యెట్లుండవలయునో గ్రహింప వీలుకాదు. స్త్రీలు సామాన్యముగ సాహచర్యమునే యనుష్ఠింపవలయునను నంశమే తెలియునుగాని, ఆ సాహచర్య మా ప్రత్యేకపురుషున కే రీతిగ నన్వయింపవలెనో తెలియదు. అదియునుగాక ఈ సాహచర్య విధానమునందు భర్తయే నియామకుడుగా నుండవలయును గద. భర్త సాంప్రదాయమే యనుసరణీయముగద. భర్త యొక్క సంకల్ప సమర్థతలే దీని మార్గమును నడుపవలయును గద. కావున నాయా స్త్రీలకు యోగ్యమగు విద్యావిధానము తమ భర్తలే లేక భర్తయభిప్రాయాదులే నియమింప వల యును. వివాహముతో నగత్యములేని స్త్రీకిఁ బురుషుని విద్యాపద్ధతియే యనుసరణీయము. వివాహములేని స్త్రీలు తమ స్త్రీత్వమును విసర్జించినవారుగ భావింపవలయును. ఏలనన స్త్రీత్వమను లింగభేదము ముఖ్యముగ బ్రజావృద్ధికే యేర్పడినది. స్త్రీపురుషసంయోగమునఁ బ్రజావృద్ధి కలుగును. వారుభయులును సంయోగాపేక్షను విసర్జించినచో సందులకై యేర్ప

డియుండు లింగభేదములను గూడ విసర్జించినవారై యోగి
యోగినీసంజ్ఞలతో వర్తించెదరు. లింగభేదము ప్రజావృద్ధి
నిమిత్తమే యేర్పడినదని సిద్ధాంతము. అట్లుగాక ఆనందజన
నమునకును లింగభేదము ఏర్పడినదని కొందఱమతమై యుండ
వచ్చును. ఆనంద మనునది కర్తయొక్క యవస్థయె. పుత్రాది
ప్రజోత్పత్తి నూతన వ్యక్తియొక్క సృష్టి. ఆనందము వ్యక్తి
యొక్క యవస్థావిశేషము. ఇతర వ్యక్తియు, ఇతరవ్యక్తి యయి
నను స్వాత్మానుభోగ్యముగ సృష్టించి భోగించుటయం దుద్భ
వించునని చెప్పఁగొనదగును. అప్పుడు భోగ్యము లింగభావముఁ
గలిగియుండును. అట్టిచో సంయోగము విధింపఁబడియే యు
న్నది. కావునఁ గేవల మానందజననమునకు గూడ సంయోగ
మవసరము. సంయోగమే వివాహము. ఈ మతమం దానం
దము స్వావస్థయేయని భావింతురుగాని యీయవస్థ భోగ్య
సృష్టిగ భావింపఁబడి యా భోగ్యముతో నొనరింపబడిన భో
గమువలన పుట్టినదను స్థితిని గ్రహింపలేకున్నారు.

పురుషుని విద్యాపద్ధతియె స్త్రీ యవలంబింపవలసినదని
చెప్పినప్పుడు సగుణోపాసనతో నిర్గుణోపాసనకుగూడ నర్హత
గలదని గ్రహింపబడవలయును. యోగి, గృహస్థవేషము
లేకపోయినప్పటికిని తన యనుష్ఠానమునందు విశ్వమంతయు
భోగ్యముగ గ్రహించియే యున్నాఁడు. వ్యక్తిత్వదశయం
దిందులకు భిన్నముగ వర్తింప వీలు లేనేలేదు. యోగియు
మహాభోగియే. ఇటులనే యోగినిగూడ మహాభోగినియని
గ్రహింపవలయును.

స్త్రీలకు చిన్నవయసునందే కొందఱకు వివాహము కావింపఁ బడుటయు, రజస్వలానంతర వివాహములుకూడ జరుపబడుటయు, వివిధమతములలో గనఁబడుచున్నవి. ఈ మతభేదములనుగూర్చి చర్చ నిచట గావింప నవసరములేదు. ఈ వివిధమతములందు స్త్రీవిద్యావిధాన మెట్లిముడ్చవలయునో యోజింపవలసియున్నది. స్వల్పవయస్సునందు అనగా ఎనిమిది సంవత్సరములు మొదలు వివాహితలైన బాలికలకు విద్యాపద్ధతి యెక్కువ సులభముగను సఫలముగను వర్తింపఁ జేయనగును. ఇందులకుఁ గారణమేమన యౌవనోదయమందున్న స్త్రీ చంచలచిత్తయై నియతకర్మానుష్ఠానమునకు స్వాధీన కాకయుండును. స్త్రీవిద్యకు గురుస్థానము వహింపఁదగిన వారిలో భర్త ముఖ్యుఁడు.

భర్త తరువాత తండ్రిగాని సోదరుఁడుగాని కన్యాదాతగాని యోగ్యుఁడు. చిన్నవయసునందు భర్త గురువుగ నుండవలసినచో నతని కప్పటికి శాస్త్రోక్త బ్రహ్మచర్యవ్రతము సమాప్తమై దాదాపు 28, 30 సంవత్సరముల వయసుండనోపును. అట్టిస్థితిలో తన సంకల్పమున కనుగుణముగ తన భార్యయొక్క విద్యాపద్ధతినిగూర్చిన యభిప్రాయమును వివాహమువలన తనకు స్వాధీనయయిన బాలికకు వ్రతాద్యనుష్ఠానమును నేర్పించి యాచరింపజేయు సమర్థత గలిగినవాఁడై యుండును. తాను స్వయముగగాని తన తల్లిదండ్రులను గాని భార్యయొక్క తల్లిదండ్రులనుగాని నియోగించి యతఁడీ కార్యమును నెరవేర్పదగును. వరుఁడుయథావిధిగ బ్రహ్మచర్యము

జరుపని పక్షమున వరుని తలిదండ్రులు లేక విద్యాగురువుగాని వివాహితయగు బాలికకు విద్యాపద్ధతిని నియమించువారగు చున్నారు.

రజస్వలానంతరము వివాహమయిన స్త్రీకి భర్తయే స్వయముగ విద్యాపద్ధతి నేర్పరచి యాచరింపఁజేయువాఁడుగ నున్నాఁడు. ఇందేమియు దోసము లేదు. ఏలనన స్త్రీ విద్యా విధానమంతయు పురుషుని సాధనాపద్ధతి నాశ్రయించియే యుండవలయును గనుకను తనయందు బద్ధానురాగయైన స్త్రీ తనకు సంపూర్ణముగ స్వాధీనయై యుండుటచేతను - అనగా విద్య నభ్యసించుటకును, తత్సిద్ధికిని ప్రధానమగు గుణవిశేషము శ్రద్ధయగుటచేత నట్టిశ్రద్ధ యనినచో నిర్వివాదముగ, గురు ముఖస్థముగ జ్ఞానవిశేషముల బరిగ్రహించు దీక్షగాన, ననురాగమందును భార్యాభర్తల యనురాగమందు నిట్టి శ్రద్ధాభక్తులు సంపూర్ణముగ నొదవును కనుకను యౌవనోదయమయిన స్త్రీప్రాకృతికస్వభావసంపూర్ణతఁ జెందినదగుటచేతను అందువలన విషయజ్ఞానమును సులభముగా గ్రహించుట యందు సమర్థత గలదగుటచేతను, సాహచర్యవిధానము సంపూర్ణముగ ననుష్ఠింపఁజేయుటకు యౌవనోదయమైన స్త్రీ తన సహజశృంగారచేష్టలచే సాహచర్యమునే సర్వదా ఆచరించును గనుక మిక్కిలి సులభముగ నందు వర్తింపఁజేయ వీలగును గనుకను రజస్వలానంతర వివాహితయగు స్త్రీకి భర్తయే విద్య నొసఁగువాఁడుగ గ్రహింపవలయును.

ఇట్టి స్థితియందు వివాహోత్పూర్వ మించుమించు 15,16 సంవత్సరములు విద్యావిహీనలై వర్తింపవలయునా యను ప్రశ్న స్ఫురింపవచ్చును. ఇందుకు సమాధానము ధర్మపురుషార్థానుసరణమగు విద్యయే వివాహోత్పర మనుష్ఠింపఁజేయవలయునని చెప్పఁబడినది గాని స్త్రీజాతికి సర్వసామాన్యముగ నవసరమగు విద్య యనుష్ఠింపఁ జేయఁగూడదని కాదు. అది యేటదియో ముందు చెప్పవలసి యున్నది. పురుషుని సర్వదా రంజింపఁ జేయుటకును గృహకృత్యముల నెరవేర్చుట మొదలయిన సామాన్యకర్మానుష్ఠానమందుఁ బ్రావీణ్యము స్త్రీకి కలుగజేయ వలయును. ఈ కర్మ లన్నియు పురుషార్థసాధనకు బరికరములుగనే పరిణమింపవలయు నను సంశము మఱువఁ జనదు. అవి యెవ్వి యన:—

పురుషార్థము.

1. పాకశాస్త్రము — కామము.
2. గణితము — అర్థము.
3. వ్రాత, చదువు — కామార్థములు.
4. అలంకారము, నాట్యము, సంగీతము, ఇత్యాది రసోపాసనాపరికరములు — కామము.

వీనియందు విద్యనేర్పుట కేవల ద్రవ్యార్జననిమిత్తమై వర్తకముఁ జేయుట, అనగా వినియోగ మేదియో యోచింపక వినియోగ ముండునని యూహించి యీ విద్య నేర్పింప

బడును. ఇది భర్తలేకనే తలిదండ్రులచే నేర్పింపనగును. ఇది సహజసౌందర్యమునకు వన్నెc బెట్టుటవంటిది. వివాహమైనప్పుడే లక్ష్య మేర్పడుc గావున నంతవరకిందు లభించెడి విషయజ్ఞానము కేవలము శుష్కతరూపముగ నుండును. ఇది లేకున్నను నంత నష్టములేదు. ఏలనన వివాహానంతర మతి స్వల్పకాలమందె దీని నభ్యసింప వీలగును. ఇందు ముఖ్యమయినది యలంకారము. దీనియందు స్త్రీకి సహజనైపుణ్యము కలదు. స్త్రీత్వమె యలంకారరూపము. కానిచో సంయోగాభావము తటస్థించును. అందువలన సహజమైన యలంకారాన్వేషణమును విద్యారూపమున విశేషముగ నారాధించుటయేర్పరుపc బడును. పాకము గృహధర్మముల ననుసరించియు వర్తమానమందు వ్యవహారపద్ధతుల ననుసరించియు స్త్రీలు నేర్వవలసి యుండుటచే పురుషుని రుచ్యనుకూలముగ పాకము నేర్చుకొనవలసి వచ్చినను సాధ్యాసాధ్యవిశేషముల గమనించి చిన్నప్పటినుండియే స్త్రీలకు పాక మభ్యసింపc జేయబడుచున్నది. నిశ్చయముగ నిది కూడ సాహచర్యానుష్ఠానములో జేరవలసినదే.

కావున వివాహాత్పూర్వము, పరమం దభ్యసింపనగు విద్యాపద్ధతులకనుసరణముగ, లక్ష్యరాహిత్యమువలన గలుగు దోషములc బోదోలి కించిద్ జ్ఞాన మలవడ జేయవచ్చును. స్త్రీయొక్క జీవితమంతయుc బురుషుని పురుషార్థసాధనకు సహాయ పడవలయును. కనుక నీజ్ఞానముగూడ పురుషుని యభిప్రాయ ప్రకారమే జరిగిన బాగుండును. అందువలననే యెని

మిది సంవత్సరములు మొదలు స్త్రీకి వివాహముఁ జేయుట సరియైన స్త్రీవిద్యకు సహాయకారిగ నుండును. పురుషుని విద్యాభ్యాసమునకు ఆత్మదర్శనమే లక్ష్యము. స్త్రీవిద్యాభ్యాసమునకుఁ బురుషుని పురుషార్థసాధనాసాహచర్యము లక్ష్యము. కావున ధర్మపురుషార్థమునందు స్త్రీకి విద్యాపద్ధతి యెట్లుండవలసినది తద్భర్తయె నియామకుఁడై నప్పటికి సర్వజనసామాన్యముగ వర్తింపనగు కొన్ని మూలసూత్రము లీక్రింద నుదాహరింపఁబడుచున్నవి.

**1.** వ్రతాచరణము:– ఇది ద్వివిధము. (అ) భర్త శ్రేయస్సే ప్రధానముగ గౌరి, శ్రీ, వాణీ, గౌరీ, ఇత్యాది దేవతారాధన - ఇది స్త్రీ స్వయముగనె యనుష్ఠించును. (ఆ) పురుషార్థసాధనకై భర్తతో సాహచర్యవృత్తి ననుష్ఠించు వ్రతములు. ఉదాహరణ: వేదోక్తకర్మలు.

**2.** సప్తసంతానావాప్తి:— ఇదియె ద్విజారాధన, వనము, తటాకము, నిధి, అగ్రహారము, దేవాలయము, ప్రబంధము, పుత్త్రుడు వీనియందు సాహచర్యము.

**3.** పురాణేతిహాసశ్రవణపఠనాదులు.

(2) అర్థము.

అర్థపురుషార్థమున అభావముననే (in abnormal circumstances) స్త్రీకి అనుష్ఠానాధికారము కలదు. దేశ, కాల, పాత్రముల ననుసరించి స్త్రీలు పురుషకార్యములఁగూడ

చేయవచ్చును. స్త్రీయందు సాహచర్యముగ గాక సంపూర్ణముగఁ బురుషకార్యములను జేయవలసిన యావశ్యకము సంభవించును. ఇందుల కుదాహరణములు: ప్రజాజీవనము, సంగ్రామావిష్టమైనప్పుడు పురుషులు యుద్ధరంగమున కేగ స్త్రీలు సమస్తవ్యవహారముల జరుపవలసి యుందురు. ఉ: ప్రస్తుత కాలమం దైరోపాదేశము. (2) జీవనోపాధుల నిమిత్తమై వ్యవసాయమందుఁగాని, యితర పరిశ్రమలందుఁగాని కొంచెముగనో సంపూర్ణముగనో స్త్రీలు కులవృత్తులను జరుపవలసి యుందురు. ఉ: చాకలులు, సాలీలు, కుమ్మరులు మొదలైనవారు.

పురుషుడు తనవృత్తియందు సర్వకాలము వినియోగించుటకుఁగాని, సంకల్పించిన కార్యము సంపూర్ణముగఁ జేయుటకుఁ దగినసహాయభూతములు లేనప్పుడుగాని లౌకికవ్యవహారమున సంగ్రామ దుర్భిక్షాద్యాగంతుకావస్థలు తటస్థించినప్పుడును, అర్థ పురుషార్థసాధనకు అభావస్థితియని గ్రహింపవలయును. ఇట్టి సందర్భమున స్త్రీల కీపురుషార్థసాధనయందు సంపూర్ణశక్తిని ఆరోపింపవలసిన ఆవశ్యకతయున్నది గనుక స్త్రీలకు అర్థసంగ్రహయోగ్యమగు విద్యావిధానము సంపూర్ణముగ నేర్పింపవలయును. దీని యాచరణ యభావమం దనివార్యమై స్పష్టముగ గ్రహింపవలయును. అభావస్థితి యీశ్వర ప్రేరణచేఁ దటస్థించును గావున నందుకు సమర్థత సంపాదించి స్త్రీలు స్మృతిరూపముగ నిల్పుకొనవలయును. అర్థ పురుషార్థమందే విశ్వమునకు లయావస్థ గ్రహించుచున్నాము గనుక

యిందలి యభావస్థితియందు స్త్రీకి సంపూర్ణాధికారము నొసంగుచున్నాము కనక స్త్రీ యప్పుడుసర్వశక్తి సమన్వితయై, స్థితిలయకర్త్రియై రాజరాజేశ్వరీరూపిణియై విరాజిల్లును. ముఖ్యముగ, మహాశక్తిరూపము సంహారకర్మనే యాచరించును. అట్టిమహాశక్తిస్వరూపారోపణము (potentiality of being endowed with Supreme Power) బీజరూపముగ స్త్రీస్వభావమందున్న కారణమున నె బీభత్సభయానక రసాస్వాదనాపరులగు శాక్తేయవ్యక్తులు స్త్రీ రూపము నుపాస్యముగ గ్రహించుచున్నారు (అ) కులవృత్తిని గురించినవిద్య (ఆ) రాజకార్యములందు గృహస్థునకుఁ గలవిధ్యుక్తకర్మలందలి నేర్పు, మైనరుల సంరక్షణ మొదలయినవి.

(3) కామము

(అ) కామతంత్రము - (సంభోగరసానుభవము) కేళియందు భర్తయొక్క నిజస్వరూపము గ్రహించుటకును, సంభోగసిద్ధికై వలయు పరికరముల నన్నిఁటిని సమకూర్చుకొనుటకును, ముఖ్యముగ వశీకరణమందు విద్య నభ్యసింపవలయును. (ఆ) భక్తి - భర్తనే యీశ్వరునిగ భావించి యారాధించుట. నాట్యము, సంగీతము, ఇత్యాదికళాప్రదర్శనములందు శిక్షింపఁబడవలెను.

(ఇ) పాకము.

పురుషార్థసాధనయందు స్త్రీ కెంత భాగము యోగ్యమో విమర్శింపఁబడినది. తరువాత స్త్రీయొక్క స్వభావము ననుసరించి యనగా జాతిభేదము ననుసరించియును విద్యా

విధాన ముండవలయును. ఈ జాతిభేదము లింగభేదము (Sexual constitution)ను అనుసరించి యుండును. పద్మిని, హస్తిని, శంఖిని, చిత్రిణి - ఈ చర్చనుబట్టి పురుషార్థసాధన యందు స్త్రీకి గూడ చాలవర కధికారము కలదని తెలుచున్నది. ఇది సాహచర్యరూపముగనే యనుష్ఠింపవలయును. ఇట్టి సాహచర్యానుష్ఠానమునకే విద్యావిధాన మేర్పరుపఁబడవలయును. తిర్యగాదిజంతువులకుఁ గొన్నిఁటికి తప్ప అనగా మనుష్యులకు సాధననిమిత్తము వినియోగపడునవి తప్ప, ఉ: గోవు, సహజకర్మయే సిద్ధి నిచ్చును. స్త్రీలకును, ద్విజేతరులకును, సహజకర్మయు, కించిత్కల్పితకర్మయు వర్తించును. సంపూర్ణాధికారము ద్విజులలోఁ బురుషులకే వర్తించును.

